# ప్రత్యేక సదుపాయం!

**సరకు ఉన్నంత వరకే**




ప్రతి డబ్బాలో ఇదివరకు ఉన్నంత బోర్న్‌విటా (450 గ్రా. నికరం) ఉంటుంది.

**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం – క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

Bensons/5322

నాన్నగారూ, మీ దగ్గర ఎంత మంచి సువాసన

## వదలలేని లక్మే టాల్కం

ఎన్నుకొనుటకు ఐదు మరపురాని సువాసనలు. సాటిలేని లక్మే. రోజంతా మిమ్ముల్ని తాజాగా, చల్లగా ఉంచగల టాల్కం. లక్మే కల్పించే పరిమళభరిత వర్చస్సు పురుషులకు చాలా ఇష్టం. ఆడపిల్లలకు దీనిపైన ఎంతో ప్రేమ. లక్మే టాల్కం అమిత మెత్తనిది. ముఖానికి వాడేందుకు గూడా చక్కనిది. టాల్కం చల్లుకొని ఆనందించండి. గంటల తరబడి సువాసనా లహరులలో తేలిపోండి.
మిమ్మల్ని కవ్వించే ఐదు సువాసనలు. మీడియం మరియు ఎకానమీ సైజులలో లెవెండరు, వెటివర్, నిర్వాణ్ మరియు శాండల్. పెద్ద ఫామిలీ సైజులో ఫ్లోరల్ మిస్ట్




# లక్మే టాల్కం

మక్కువ గొలిపే పరిమళ భరితం

# ఉత్తరాలు

### కథలు

7—8—70 పత్రికలో మీరు ప్రచురించిన 'పేరులో నేమున్నది' [పడమింటి లలితగారి] కథ చదివేను. కథ ప్రారంభంలోనే 'నార్మల్‌గా విశ్వేశ్వరం ముఖంయొక్క పవరు సిక్స్టీ వోల్ట్సు అని చెప్తే ప్రస్తుతం జీరో వోల్ట్సు అని చెప్పడానికి కూడా కొంచెం ఆలోచించాలి' అని ఉంది. ఈ వోల్ట్సు అనే పదం అచ్చు తప్పయినా అయిఉండాలి. లేదా? రచయిత్రి పొరపాటైనా అయి ఉండాలి. పవరు వాట్సులోను వోల్టేజి వోల్టులలోను వాడ కంలో ఉంది.

బులుసు వెంకటేశ్వర్లు, నాగపూర్ [మహారాష్ట్ర]

*　　*　　*

'నాశ' కథానిక బాగుంది. బాగా డబ్బును గడించి, సుఖాన్ని అనుభవించే వారిలో కన్నా, పేద మధ్య తరగతి వారిలో వున్న దయ, కరుణ, త్యాగము పై తరగతి వారిలో లేదనే సత్యాన్ని చెప్పింది కథ. నిజమంతే కదా. ఉన్నవారికి అయిపోతుందే అన్న బాధ, లేని వారికి తన కేమి లేదు అన్న విశ్రాంతి.

అలహరి సుబ్బయ్య [కొవ్వూరు]

### సీరియల్

4—9—70 వారపత్రికలో బరంపురం నుండి శ్రీ ధనంజయగారు మీ పత్రికలో పడిన సీరియల్స్‌లో మగవారికి అన్యాయం జరిగిందని, పైగా మీది పక్షపాతమని కూడ అన్నారు. ఇది చాల అన్యాయం. దీనిలో మీ పక్షపాతమేది లేదు.

ఇప్పుడు ఆడవారు పట్టుదలతో అకుంఠిత విశ్వాసంతో కృషి చేసి మగవారితో పోటీగా నిలబడు తున్నారు. అందుకే చాల విజయాలు సాధిస్తున్నారు. ఈమధ్య చాల చదువులలో ఆడవారిదే పైచేయి అని అందరికి తెలిసిన సత్యమే. అంతెందుకు మైసూరు రాష్ట్రంలో వివిధ తరగతులలో మొదటి రాంకు రాగా ప్రభుత్వం ద్వారా జపాన్ ఎక్స్ పోకు పంపబడుతున్న విద్యార్థి విద్యార్థినుల బృందంలో దాదాపు సగంమంది ఆడవారే!

కాబట్టి మీరు అసలు 'పురుషులు ఎందుకని ఇట్లా వెనుకబడుతున్నారు' అన్న విషయాన్ని ఆలోచిస్తారని ఆశిస్తాను.

కా. వా. ప్ర. కు. శోభ [గుల్బర్గా]

*　　*　　*

వినాయక చవితి ప్రత్యేక సంచికలో సీరియల్ నవలల గురించి, పాత్రోగారు వ్రాసిన ఉత్తరం చదివాను. 21 నవలల్లో రచయితలవి 19, రచయిత్రులవి 2 మాత్రమే అని వ్రాశారు బాగానే వుంది. ఆంధ్రపత్రిక చిన్నచూపు చూస్తోందని, పక్షపాతంగా ఉంటుందని అన్నారు. ఇది సమంజసముగా లేదు. ఈ పక్షపాతం పత్రికే కాదు ప్రతి పత్రిక చూపుతోంది. ఏ పత్రిక చూచినా

# ఉత్తరాలు

రచయిత్రుల సీరియల్స్ కొల్లలుగా వస్తున్నాయి ఇప్పుడన్నీ స్త్రీల పత్రికలైపోయాయి. స్త్రీల అభిమానాన్ని చూరగొనటానికిది ఒక ఎత్తులా వుంది. సీరియల్స్ కాదు, పోటీ కథల్లో కూడా ఈ పక్షపాతం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. ఈ విషయం గూర్చి ఈ ఒక్క ఆంధ్ర పత్రికనే దూషించటం బాగాలేదు, అన్ని పత్రికలకు వర్తించేటట్లు వ్రాసి వుంటే బాగుండేది

అడపా రామకృష్ణ, [విశాఖ]

**ముఖచిత్రం**

21—8—1970 సంచిక ముఖచిత్రము 'రేఖ' అద్భుతముగా ఉంది. సాంబుగారికి మా అభివందనలు.

—తాడాల రామకృష్ణ, బాబు, [పిఠాపురం]

* * *

మీరు 14—8—70 వారపత్రిక ముఖచిత్రం కాంగ్రెసు రెండుగా చీలినందుకు భారతమాత దుఃఖించుచున్నట్లుగా చిత్రించినారు ఇది సందర్భోచితముగా లేదు. 23 సంవత్సరములు అవిచ్ఛిన్నముగా పరిపాలించిన కాంగ్రెసు పాలనలో, ప్రజల ప్రాణ మానములకు రక్షణ లేక, ఆకలి చావులు, లంచగొండితనం, కులాభిమానం, పార్టీ కక్షలు, పెరిగి దుష్ట శక్తులకు విదేశీయ ఏజంట్లకు దేశద్రోహులకు ఆలవాలమైనదిగా నుండి రేపటి పరిస్థితి ఏమి కానున్నదో అన్నట్లుగా నున్న యీ స్థితిలో కాంగ్రెసు రెండుగా చీలి దేశమునకు ఎంతో మేలు చేసి భారతమాత కష్టములు తొలగుటకు నాందిగా ముఖచిత్రము, సంతోషముతో నున్న ముఖముగా చిత్రించిన బాగుండేది.

పి. రాజారావు [చీరాల]

**నాటికల పోటీలు**

చెన్నపురి ఆంధ్ర మహాసభ దసరా ఉత్సవాల సందర్భంగా నాటికల పోటీ ఏర్పాటు చేస్తున్నారు. సెప్టెంబరు 20 లోపుల దరఖాస్తులు పంపాలి. వివరాలకు : సెక్రటరీ, చెన్నపురి ఆంధ్రమహాసభ, విక్టోరియా పబ్లిక్ హాల్, మద్రాసు—2.




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 18—9—'70

శ్రీ సాధారణనామ సం|| భాద్రపద బహుళ తదియ

సంపుటము : 64 సంచిక : 3

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26 00 |
| 6 మాసముల చందా | 13 00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: కొత్తనటి ఉషానందిని
ఫోటో : ప్రభాకర్.


**కథలు :**

గీతోపదేశం — 8
ఆహుతి — 32

**సీరియల్ నవలలు:**

ఆచరణలో అభ్యుదయం — 16
పద్మవ్యూహం (నాటకం) — 24
ఆరాధన — 44

**వ్యాసాలు, శీర్షికలు- సినిమా:**

ఉత్తరాలు — 2, ఊమెన్ కార్టూన్ —5, మ్యాటినీ లేఖ- 6 కూరలూ—గుణాలూ—19, ధర్మపథం-23, గాడాధివరాలు(కార్టూన్)-29, ప్రశ్నావళి — 30, ఎలుకలూ — మద్యపానోన్మత్తులూ — 35, వారఫలం — 42, డాక్టర్ కబుర్లు — 50, ఒకనారం వినోదం — 52, బృహత్కథామంజరి—54 రంగులరాట్నం-56, కొత్తనటి ఉషానందిని-పరిచయం—58, చిత్ర సమీక్ష - 59, సినిమా, సినిమాడైరీ-60, మీకు తెలుసా-62, పిచ్చాపాటీ-63,పుస్తకాలు—64.


బాధ పడకండి, పర్సులగొప్పతనం పోయింది


బాగుంది? కాని, ఏమిటి మేలు?
ప్రజలు
1000 కోట్లు వ్యాపారం


బి.బి.సి
రష్యన్స్ మాటేమిటి?
బి.బి.సి. విలేఖరి బహిష్కరణ


న్యాయం
న్యాయస్థానంలో కమ్యూనిస్టు ప్రవేశం

# 1971 జనవరికి మధ్యంతర ఎన్నికలా?

[illegible] '[illegible]' [illegible] [illegible] [illegible] [illegible] మెంటు [illegible] [illegible] అవుతుంది.

ప్రధానమంత్రి మేడమ్ గాంధిగారు జనవరి 1971కి మధ్యంతర ఎన్నికలు పెట్టించడానికి నిశ్చయించుకున్నారన్నది ఖాయం. భూస్వామ్య వ్యతిరేక ఉద్యమం ఎన్నికలలో తోడ్పడగలదనే కమ్యూనిస్టులు వారిని కాపీ కొట్టి సోషలిస్టులు ప్రోత్సహించి ఉంటారని ఇప్పుడు తెలిసిపోతోంది. మేడమ్ గాంధిగారి ప్రధాన మంత్రిత్వానికి ఉత్తరప్రదేశ్‌లోని పరిస్థితి ఆధారం కాగలదు., అక్కడ కొత్త కాంగ్రెసు, భారతీయ క్రాంతిదళాల మధ్య పొసగటంలేదు. మేడమ్ గాంధిగారి సహాయంతో శ్రీ చరణ్ సింగ్ కాంగ్రెసు మంత్రివర్గాన్ని కూల్చి తన భా. క్రాం. ద. మంత్రివర్గాన్ని నెలకొల్పారు. [వీరు మేడమ్ గాంధికి తగిన [illegible] అని రాజకీయ [illegible] కొందరు ఇక్కడ అనుకుంటున్నారు.] భా. క్రాం. ద., కొత్త కాంగ్రెసు కలిస్తే బాగుంటుందనే ఆశపెట్టారు శ్రీ సింగ్‌కి. శ్రీ సింగ్ ఈ ఎత్తుకి లొంగలేదు. ఆయన పార్టీ ఎలాగూ అధికారంలో ఉంది, మధ్యంతర ఎన్నికలే గనుక వస్తే —ఈ భయం ఎప్పుడూ ఉంది!—విడి పార్టీగా వారికి ఉన్న అవకాశాలు కొత్త కాంగ్రెసులో లీనమయిపోయినప్పుడు ఉండవు. కమ్యూనిస్టులకి గ్రామాలలో పెద్ద పలుకుబడి లేదు. మొత్తంమీద వారి అనుచరులు అందరూ నగరాలలోనివారే, కార్మిక వర్గంలోనివారే. భూస్వామ్య వ్యతిరేక ఉద్యమం సహాయంతో గ్రామ ప్రాంతంలో పేరు సంపాదించుకుందామని చూశారు కమ్యూనిస్టులు.

## కాపీ

సోషలిస్టులకి కమ్యూనిస్టులని కాపీ కొట్టటం బాగా చేతనవునని ఇంతకు ముందే చెప్పాను. వారికి స్వంతంగా దేనిని గురించి ఆలోచించటంగాని, చెయ్యటంగాని రాదు. శ్రీ డాంగే భూస్వామ్య వ్యతిరేక ఉద్యమం మొదలుపెట్టారు. శ్రీ ఫెర్నాండెజ్ వెంటనే వారి శిష్యులయ్యారు. శ్రీ జోషి డాంగేగారి శిష్యరికాన్ని పుచ్చుకోనటమేకాక గృహ వ్యతిరేక ఉద్యమం గురించి కూడా మాట్లాడటం మొదలుపెట్టారు.

మేడమ్ ఇందిరాగాంధిగారు అనుసరించే మితవాద వామ పక్ష విధానాలుగాని, భూస్వామ్య వ్యతిరేక ఉద్యమం గాని వోట్లు తెచ్చిపెట్టవు. వోటు వేసేది జనం. మతం, వర్గం—వీటన్నిటికంటే [illegible] [illegible] కాదు. వోటర్లకి [illegible] విధానపరంగా కావలసిన వస్తువులు చవకగా దొరకాలని కోరుకుంటారు. వీటిలో ఆహార ధాన్యాలు అతి ముఖ్యమయినవి. ఈమధ్య పంటలు బాగా ఉన్నాయి, ధాన్యాల ధరలు కూడా ప్రభుత్వం మద్దతువల్ల బాగానే ఉన్నాయి. ఎందరో జనం జేబులో, ఇప్పుడు మునుపటికన్నా ఎక్కువ డబ్బు ఉంది. ఈ డబ్బుతో కొనుక్కునేందుకు కావలసినన్ని వస్తువులు లేవు. కూలికోసం పనిచేసే కర్షకులకి ఆదాయాలు ఉన్నాయికాని భూములు లేవు. ఈ పరిస్థితి ఏర్పడటానికి మరోక పెద్ద కారణం ఉంది., అదేమిటంటే, పెద్ద రయితుల దగ్గర ఎక్కువ డబ్బు ఉండటంచేత వారు చిన్న చిన్న పొలాలని కొని వేస్తూ ఉంటారు. అసలు 'పచ్చ విప్లవం' వల్ల వీలు అయింది ఏమిటంటే భూములు ఎక్కువ చేతులనుంచి తక్కువ చేతులలోకి వెళ్లటమే అనవచ్చు! ఈవిధంగా గ్రామాలలో కర్షక బిర్లాలు, టాటాలు పుట్టారు. పంజాబు, హర్యానాలలో కొత్త రకం జమీందార్లు తయారయ్యారు. అకాలీలలో ఎందరో పెద్ద భూస్వాములున్నారు. పంజాబులో ప్రభుత్వం అకాలీల ప్రభుత్వం. ఇకభూముల పంపిణీ ఎంత సవ్యంగా సాగుతుంది.

## ఆశల తర్వాత వోట్లా?

కమ్యూనిస్టులు ఆశ చిక్కులని తెచ్చిపెట్టారు. ఎంత కాదన్నా పెద్ద భూస్వాముల సంఖ్య కన్నా భూములులేని కర్షకుల సంఖ్యే అధికం. వీరిలో ఆశ పుట్టించిన తర్వాత ఎన్ని వివాదాలు చెప్పినా వోట్లు పడ్తాయా?

బ్యాంకుల జాతీయం చేసి అగ్గిపోయినట్లే. ఈ వివాదంవల్ల వోట్లు పడవు. ఇక రాజాభరణాల బిల్లు ఆమోదింపబడ్డా దానివల్ల వచ్చే లాభం ఏమీ ఉండదు [కొత్త కాంగ్రెసు వారికి]. ఎందుకంటే, [కొత్త] కాంగ్రెసులో ఉంటున్న సంస్థానాధీశ్వరులు ఇక ఎదురు తిరుగుతారు. [ఈ లేఖ రాసిన తర్వాత రాజ్యసభలో రాజ్యాభరణాల రద్దు బిల్లు వోడిపోయింది—సం] ప్రజలకి ఇది అంత ముఖ్యమయిన సంస్కరణగా కనిపించకపోవచ్చు. ప్రభుత్వరంగం కర్మాగారాలలో వందల కోట్ల రూపాయల నష్టం వస్తూ ఉంటే మాజీ సంస్థానాధీశ్వరులకి ఇచ్చే సంవత్సరానికి అయిదు కోట్ల రూపాయలు వారికి ఏమి మిగల్చగలవు?

## విలువ ఏమిటి?

రాజ్యాభరణాల బిల్లు పర్యవసానం మరోకటి ఉంది. దీనివల్ల ప్రభుత్వం మాటకి విలువ లేదని తెలిసిపోయింది. నామినేషన్ కాగితంమీద సంతకం పెట్టి శ్రీ సంజీవరెడ్డిగారికి విరుద్ధంగా పని చేసిన మేడమ్ ఇందిరాగాంధికి ఇది అంత పెద్ద విషయంగా కనిపించకపోవటంలో ఆశ్చర్యంలేదు. భారతదేశం గౌరవ మర్యాదలే దీనికి ముడిపడి ఉన్నాయని ఆమె గ్రహించినట్లు కనిపించదు. భారతదేశంయొక్క రాజ్యాంగ సభవారు, అప్పటి రోజుల్లో, గొప్ప కార్య దీక్షతో రాజ్యాంగంలోకి ఇమిడ్చిన పరిహారాలని ఇప్పటివారు రద్దు చేస్తున్నారు. ఈ బిల్లు ప్రవేశపెట్టటానికి కొంతకిముందు ప్రధానమంత్రిగారు సంస్థానాధీశ్వరులతో చర్చలు జరిపారు. ఈ చర్చలలో వారు అవలంబించిన వైఖరిని బట్టి అందరూ ఈ బిల్లు జరుగుతున్న సెషన్‌లో మాత్రం రాదు అనుకున్నారు. అయితే, వారు హఠాత్తుగా దానిని ప్రవేశపెట్టారు.

## 1947 తర్వాత ...

1947 తర్వాత కొందరు కాంగ్రెసువారికి తమ అంతఃకరణం గురించి గుర్తు వచ్చింది పోయిన ఏడు రాష్ట్రపతి ఎన్నికలో. పోయిన సంవత్సరం మేలుకున్న ఈ అంతఃకరణం ఇంకా నిద్ర పోలేదని కొందరు సంస్థానాధీశ్వరులు ప్రధానమంత్రికి చెప్పుకున్నారు. ఈ విషయంలో మాత్రం అంతఃకరణం చెప్పినట్లు వోట్లు వెయ్యటానికి వీలులేదని మేడమ్ గాంధిగారు ఆదేశించారు. ఈ సందర్భంలో మేడమ్ గాంధిగారు కొంత ప్రయాసకి లోనయ్యారు. ఎందుచేతనంటే ఆమె బలానికి మూలాధారాలలో ఒకరయిన శ్రీ డాంగే సంస్థానాధీశ్వరులకి పరిహారం చెల్లించటం ఏమాత్రం వీలులేదన్నారు.

## బి. బి. సి. వ్యవహారం

న్యూఢిల్లీలో బి. బి. సి. కార్యాలయాలని మూసి వేసి మన ప్రభుత్వంవారు మన సమాజాన్ని బయటి ప్రపంచానికి మరింత దుర్లక్ష్యంగా చేశారు. ఈ మూసి వేతవల్ల తేలిన మరోక విషయం ఏమిటంటే భారత దేశం రష్యా ఉపగ్రహాలలో ఒకటి అని. బొంబాయి ముఖ్యమంత్రి ఇంటిని కొట్టవచ్చేట్లు ఉండే పెద్ద

భవనాన్ని ఒక దానిని రష్యావారు కట్టారు. కేరళలో రష్యావారు 'సంస్కృతి నిలయం' ఒక దానిని కట్టినందుకు కొన్ని పత్రికలు విమర్శించాయి., రష్యావారి చెప్పు చేతల ప్రకారం నడుచుకునే భారత విదేశీ వ్యవహారాల శాఖవారు రష్యా నిర్మిస్తున్న భవనం పనిని కొంతకాలం ఆపించి, ఇంతలో భారతదేశంలో ఉంటున్న అమెరికా సంస్కృతి నిలయాలని మూసివేయించారు., రెండవ పనిపూర్తి కాగానే రష్యా వాళ్లకు 'సంస్కృతి నిలయం' నిర్మాణం తిరిగి మొదలు పెట్టారు.

## షా చరిత్ర

జార్జి బెర్నార్డ్ షా ఐరిష్‌వాడు. అతను లండన్‌కి వచ్చి స్థిరపడిపోయాడు. అక్కడ బ్రిటిష్‌వారిని వెక్కిరించే రచనలని ఎన్నిటినో చేశాడు. భారతీయుల వలెకాక, బ్రిటిషువారు తమని చూసి తాము నవ్వుకోగలరు! బెర్నార్డ్ షా రాసినవన్నీ చదివేవారు, అతని నాటకాలన్నిటినీ చూసేవారు. అతను మరణించిన తర్వాత అతన్ని వెస్ట్‌మినిస్టర్ అబ్బేలో పాతిపెట్టారు. ఇది చాలా పెద్ద గౌరవం.

ఈ సందర్భంలో 'స్టేట్స్‌మెన్' పత్రిక ఇలాగ రాసింది—

## నష్టం ఏమిటి?

'బి. బి. సి. వ్యవహారం గురించి ఎవరు ఏమను కున్నా ఒకటి మాత్రం నిజం. అధికారులు ఈ వ్యవహారాన్ని చక్కగా, నేర్పరితనంతో జరపలేదు. ఎన్నో ప్రశ్నలకి సమాధానం దొరకటం లేదు. వాటిలో ఒకటి అతి ముఖ్యమైనదని అంగీకరించాలి., అదేమిటంటే, దేశాన్ని తూలనాత్మకంగా చిత్రించే సాధనం వల్ల జాతీయ శ్రేయస్సుకి కలిగే నష్టం కన్నా బి. బి. సి. కార్యాలయాలని మూసివేసి సమాచారం వినిమయాన్ని అరికట్టి దానివల్ల తెచ్చుకున్న అపకీర్తి వల్ల కలిగే నష్టం తక్కువా? తక్కువే, అని గట్టిగా చెప్పలేము. ఈ ప్రశ్నకి సమాధానం దొరికేదాకా న్యూఢిల్లీలోని వారు కొందరు ఉక్రోషం వచ్చి ముందువెనుకలు చూసుకోకుండా ప్రవర్తించుకున్నారనే అనుమానం కొందరికి కలుగక మానదు. ఈ విషయంలో మన ప్రభుత్వానికి దేశ శ్రేయస్సుకి ఏది తగునో తగదో నిర్ణయించే హక్కు లేదని ఎవరూ అనలేరు. కాని, ఈ నిర్ణయం కొందరు అధికారులకి లేక మంత్రులకి పరిమితం అయిఉండరాదు. వారినిర్ణయానికి ప్రజాబాహుళ్యం యొక్క ఆమోదం కూడా ఉండాలి. ప్రజాశ్రేయస్సుకి ఏవేవి నష్టకారణాలో స్పష్టంగా నిర్ణయించటానికి వీళ్లు కల్పించాలి. ఏవి నష్టకారణాలో నిర్ధారించుకొనటం కూడా కష్టమే. మెచ్చనిది అంతా నష్టకారణమేనా? అందువల్ల నిషేధింప తగినదా? ఇదంతా విదేశ వ్యవహారాల శాఖవారు అనుకున్నంత తేలిక వ్యవహారం కాదు. ఎవరయినా సరే, భారతదేశంవారే అయినా సరే, కలకత్తాలో కొన్ని దృశ్యాలని చిత్రించి వాటిని అందంగా చూపించలేరు. ఇవన్నీ అభ్యంతరకర దృశ్యాలేనా? అయితే, ప్రతిరోజూ పత్రికల్లో పశ్చిమ బెంగాలుని గురించి వచ్చే వార్తలు కూడా దేశ శ్రేయస్సుకి నష్టదాయకాలే అవుతాయి. [illegible] వాదాన్ని కొన్ని రాజకీయ సిద్ధాంతాలని బలపరిచే వారు తప్పకుండా ఆమోదిస్తారేమో!

## నిరంకుశ ధోరణి

'ఏది ఎలాగ ఉన్నా సమాచారం [illegible] ప్రసారం కావాలి., [illegible] [illegible] [illegible] వాటిని అణచి వాటికి ప్రయత్నించే నిరంకుశ ధోరణికి [illegible] ముందు [illegible] ప్రోత్సాహం ఇవ్వకుండా ఉండాలి'.

[[illegible] —సం.] ●









రాత్రి తొమ్మిది గంటలయ్యింది.

రైలేదో స్టేషన్లో ఆగింది. గోపాలావు కిటికీలోంచి బయటకు చూశాడు. ఫ్లాట్‌ఫారం అంతా యెన్నికలముందు దేశం వుండే పరిస్థితిలావుంది. అందరూ యేమేమిటో మాట్లాడేస్తున్నారు. నోటు కొచ్చినట్టు నోటికొచ్చినట్టు మాట్లాడుతున్నారు. ఇంత గొడవగావున్నా గీత లేవలేదేమిటా అని గీతవంక చూశాడు. గీత నిద్దరపోతోంది. నిజంగా నిద్దర పోవటంల్లేదు. అభినయిస్తోందని కనిపెట్టాడు గోపాలావు. కిటికీమీద తలపెట్టి గోపాలావు కుడిచేతి అరచేతిలో తన యెడమ చెయ్యుంచి ఆ కిటికీమీదో తలగడా వుంచింది. ఆ తలగడా గోపాలావుకి లభించిన విజయానికి చిహ్నం.

రాత్రి తొమ్మిదవ్వంగాన నిద్దరగా మూచిస్తూ కళ్లు సగంమూసి నోటికి చెయ్యడ్డం వుంచి ఆవలిస్తూ 'నిద్దరొస్తోంది' అంది గీత.

'నిద్దరపో' అని కిటికీనేపు దిండుం చాడు గోపాలావు.

'ఛీ... ఏం మనుషులు!... పోడు' అంటూ గోపాలావంక చూసి దిండు గోపాలావు వొళ్లోకి గిరాటేసింది.

'నాకు పాటలావుగానీ... ఆ భర్తని 'పోడు' అని అనకూడదు 'పోడండి' అనాలి. నువ్వు ఫలానా నవల చదివావా యేం కొంపదీసి' అన్నాడు. తనివ్వ దలచుకున్న వుపదేశానికి వుపోద్ఘాతం మొదలెట్టాడని తెలుసుకున్న గీత ఆ విషయం మీద మాట్లాడకుండా—

'మీ వొళ్లో దిండుమీద పడుకుంటాను' అంది కింది పెదవిని ముని పంటితో నొక్కి పక్కబుగ్గమీద సొట్ట పడేలా నవ్వుతూ.

'మరలా చెప్పవేం ... అలాగే పడుకో' అనబోయాడు గోపాలావు.

గీత అలా నవ్వితే పరవశించి పోతాడు గోపాలావు. పరపంచలో నివశించేందుకూడా సిద్ధం. అందుకే మూణ్ణెద్దర్ల కొచ్చినవాడు యేడెనిమిది నిద్దర్లు చేశాడు అత్తారింట్లో. ఉన్న ఆ కొన్ని రోజులు గీత సాన్నిధ్యంలోనే గడిపాడు గోపాలావు.

గడుసు ముసలమ్మలు గుసగుసలాడుతూ—

'మీ అల్లుడు బయటకేరాడేమిటమ్మా!? మీ అమ్మాయి కొంగున ముడేసుకుందాయేం' అన్నారు.

గడుసుదనం చిన్నప్పుడో, యెప్పుడో గడగడా తాగేసినా గడపలు దాటలేనవి చెప్పుకునే వో ముసలావిడ బజార్లన్నీ నడిచి మరీవచ్చి, పరామర్శిస్తూ, తక్కువ స్థాయిలో చెప్పే వుద్దేశ్యంతో బజారు మీద వెళ్లేవాళ్లందరినీ లోపలికి తొంగి చూసేలా చేసి—

'మీ అల్లుడు, కూతురూ యిరవై నాలుగు గంటలూ బయటకు రారేమిటమ్మా?' అంది.

కొందరు ముసలమ్మలు మామూలుగా మాట్లాడేటప్పుడు కంటె రహస్యం చెప్పేటప్పుడు 'రహస్యం' అంటూనే దండోరా వేస్తున్నట్టు మాట్లాడ్తారు. గోపాలావు మండిపడి మంచంమీద కూర్చున్నాడు. 'మండిపడే వాడు కూర్చోకూడదు. నిలబడాలి' అన్న ఆర్యోక్తి గుర్తుకొచ్చి నిలబడ్డామను

కున్నాడు గాని వాళ్ళో పడుకుని పత్రిక తాపీగా చదివి వినిపిస్తున్నది గీత. విని పిస్తూ గోపాల్రావు అర్జెంటుగా లేవటంతో—గీత

'పోనీ లేవ్వరూ ...' అనింకా గీత యేదో చెప్పబోతుంటే.

'నేను లేద్దామనే అనుకుంటున్నాను. నువ్వే వాళ్ళో పడుకుని లేవనివ్వటం లేదు. అదిసరే ... నాకు గుర్తుకొచ్చిన అర్యోక్తి, సంగతి నీకెలా తెలిసింది?' అన్నాడు.

'అదిగాదండి...ఆవిడ రహస్యంగా చెబితే మీరేమిటో రాద్ధాంతం చేస్తారేమిటి? పోనియండి' అంది.

'ఆవిడ రహస్యం మండినట్లుంది'

'ఆవిడ రహస్యం మండదు. ఆవిడ రహస్యాన్ని వండి తనే తయారుచేస్తుంది' అంది నవ్వుతూ.

'నవ్వకు...యేదో విట్టు వేద్దామని మాటల్ని పట్టుకొచ్చి వాక్యాలు కట్టుకొంటున్నావ్' అన్నాడు చిరుకోపం ప్రదర్శిస్తూ.

'మీరుమాత్రం...'అంది గీత.

'నేను మామూలుగానే మాట్లాడాను. 'సింటెన్స్ కన్‌స్ట్రక్షన్' అన్న ఆంగ్ల పదాల్ని ఆంధ్రీకరించాను'

'అబ్బ...కాస్త మామూలుగా మాట్లాడండి'

'నేను మామూలుగానే మాట్లాడుతున్నాను గానీ, నువ్వు మాట్లాడకు. మీ అమ్మేదో అంటోంది.'

గోపాల్రావత్తగారు మునలావిడకు సమాధానమిస్తూ—'అల్లుడూ, పిల్లా బయటకు రాలేదంటారా? రేపు చూద్దురు గానిలెండి...మీ అల్లుడు వద్దన్నాడు కదా, అందుకని నిద్దరోతున్నాడు' అంది,

'ఏమిటీ...మీ అమ్మకి మరీ మర్యాదేం తెలీదు. అల్లుడి గురించి అట్టాగేనా మాట్టాడేది' అన్నాడు గోపాల్రావు చాలా కోపంగా.

'ఏమిటీ అబ్బాయికి మాట్లాడితే కోపం వస్తుంది. ఎవరు మాట్లాడినా, యేం మాట్లాడినా కోపం వస్తోంది' అని కొంచెం భయంవేసింది గీతకి —

'ప్రస్తానికి అలా అంటారేమిటండి... అలా చెప్పకపోతే "ఏమయ్యా! అబ్బాయ!" అంటూ ఆ ముసలావిడ లోపలికొచ్చేసేది. పోనీ మా అమ్మ అన్నదాంట్లో యేమన్నా తప్పుంటే నేను క్షమాపణ చెప్పుకుంటాను. క్షమించండి. ఏమండీ! క్షమించరూ?' అంది గీత.

'తెలుగు సినిమామీదికి మనసు పోయిందా యేమిటి? ఇవ్వాళ సినిమాక్కూడా అసలు బయటక్కూడా వెళ్ళం; తెల్సిందా?' అన్నాడు,

క్రింది పెదవిని పంటితో నొక్కిపెట్టి నవ్వింది గీత. బుగ్గన సొట్టపడింది. కొందరికి కొంచెం నవ్వగానే సొట్టపడుతుంది. కానీ గీతకి పెదవుల్ని చెవుల్దాకా సాగదీస్తే గానీ సొట్టపడదు. అయినా గోపాల్రావుకి చాలా చాలా అందంగా కనిపించింది. అలాగే గీత ముఖంలోకి చూస్తూ కూర్చున్నాడు.

'అలాగేవుండు; చాలా బాగున్నావ్' అన్నాడు గోపాల్రావు.

'అబ్బ ... మరీ అంతసేపు చూడకండి...సినిమాలో అయితే హీరో అలా చూడంగానే హీరోయిన్ చెంగు చెంగున యెగురుతూ దూరంగా వెళ్ళి పాటందుకుంటుంది. ఈ రూం చిన్నది, అదీగాక నాకు పాట్టం రాదుకూడాను.'

'అలా బుగ్గన సొట్టపడితే చాలా అందంగా వుంటావ్' అన్న ఫర్మానికి గోపాల్రావుని యేవిషయానికయినా వొప్పించడానికి అస్త్రం వుపయోగిస్తోంది గీత. పదిరోజుల్నుంచీ యిదే వరస.

కానీ యిలా తన వాళ్ళో పడుకుంటావికి మాత్రం, గోపాల్రావు వొప్పుకోలేదు.

'హనీ మూన్‌కి బయల్దేరినా మీకో సరదా లేదు' అంది గీత.

'హనీ మూన్ అయితేమాత్రం? ఇది థర్డ్‌క్లాసు పెట్టె, పైగా అన్ రిజర్వుడ్. ఆ మాత్రం తెలుసుకో నక్కర్లా?'

'అంతేలెండి ... నేనేం చెప్పినా మీరు వినరు' అంది కిటికీలోంచి బయటకు చూస్తూ.

'అదేం మాట? నువ్వు చెప్పినట్టు నేను వినడం యేమిటి ... నేను చెప్పినట్టు నువ్వు వినాలి' అని వుపదేశం మొదలెడ్దామనుకున్నాడు.

పెళ్ళయిన వెంటనే భార్యకి యెలా ప్రవర్తించాలో నేర్పాలన్నది వైవాహిక జీవితం మొదలు పెట్టంగానే గోపాల్రావు మొదట చేద్దామనుకున్న పని. అసలిలా భార్యలకి వుపదేశాలు చెయ్యకపోతే లాభం లేదని సుబ్బారావున్నాసి తెలుసుకున్నాడు. సుబ్బారావుకున్న రెండుగుణాలు చూస్తే గోపాల్రావుకి చికాకు. సుబ్బారావు పెళ్ళాం చేతిలో కీలుబొమ్మ. తనంతట తనే



# గీతోపదేశం

కాని చెయ్యడు. పెళ్ళాం ఆడది కాన్నివ్వ టానికంటూ కందరూ. కాని సుబ్బారావు అడుక్కుండగా యెవ్వరూ ఎప్పుడూ చూళ్లేదు. చిట్లపేక ఆడేందుకూ్క డా ఆవిడెప్పుడూ సుబ్బారావుని పంపదు. బజారుకి పనిమీద పంపిస్తుంది, అంతే. అయినా సుబ్బారావుకి ఆవిడ ఆడించిన ట్లాడ్తాడన్న పేరొచ్చిందెందుకో మరి! సుబ్బారావుని చూస్తే గోపాల్రావు కందుకే అసహ్యం.

'పెళ్లాన్ని చూసి భయపడ్తాడేమిటి? నాకు రేపు పెళ్ళయ్యాక చెవుతాను. నన్ను చూసయినా నేర్చుకుంటా డేమో' అని అనుకునేవాడు గోపాల్రావు ఆరోజుల్లో.

సుబ్బారావులో గోపాల్రావుకి నచ్చని విషయం యింకోటుంది. సుబ్బారావు యేవన్నా ఫంక్షన్లకిగానీ, సినిమాలకుగానీ వెళ్లినప్పుడు చూడాలి! మెయిన్‌గేటు దగ్గర నిలబడి కార్లల్లో వచ్చే ప్రతి వాళ్లకీ దండం పెడ్తాడు. తిరిగి దండం పెట్టించుకుంటాడు. కారో అరఫర్లాంగు దూరంలో వుండగానే సుబ్బారావు దండం పెట్టటం మొదలెడ్తాడు.

'ఒరేయ్ సుబ్బారావ్! అంత దూరంలో వున్న కార్లోని వాళ్లని యెలా గుర్తు పట్టావ్‌రా' అనడిగితే, వో వెధవ నవ్వు నవ్వి —

'కార్లో వచ్చేవాళ్లని గుర్తుపట్టక్కర్లేదు; వాళ్లు తెలిసున్నవాళ్లా అవక్కర్లేదు. ఇప్పుడో దండం పారేస్తే మళ్లీ వొచ్చే ఫంక్షనుకి వాళ్లే తెలుస్తారు. ఏమంటావ్ ?' అన్నాడు.

'హోరి నీ దుంపతెగ ... నిజంగానేనా ? నవ్వుతూ అంటున్నావా?' అనడిగితే సుబ్బారావేం మాట్లాళ్లేదు. కాని అతగాడ్చెప్పిందే నిజం అని తేలింది, కార్లల్లో వచ్చే వాళ్లందరూ తెలిసినట్టు చుట్టుపక్కలవాళ్లకి తెలియజేయాలన్నది సుబ్బారావు ముఖ్యాశయం. అందుకే ప్రతి కారుకీ దండం పెడుతూ వుంటాడు. అంతే కాదు. కారునిబట్టి దండం యెంతసేపు పెట్టాలన్నదీ, యెంతసేపు నవ్వాలన్నదీ నిర్ణయిస్తాడు సుబ్బారావు. ఒకరోజా నెప్పుడో రవీంద్రభారతి దగ్గర నిలబడి దండం పెడ్తూ కనిపించాడు సుబ్బారావ్.

'ఒరేయ్ ... సుబ్బారావ్ ! కనుచూపు మేరలో కారేం కనిపించటం లేదు. ఏమిటీ సూర్య నమస్కారాలు' అని గోపాల్రావడితే,

'అబ్బే...వచ్చే కారుకి కాదోయ్ దండం పెట్టేది, వెళ్ళినకారుకి. ఇప్పుడే వో పది నిమిషాల క్రితం 'స్టిమత్' కారొకటి వెళ్లిందని అన్నాడు.

సుబ్బారావులోని ఈ రెండు విషయాలు చూస్తే గోపాల్రావుకి కంపరమెత్తినట్టుంటుంది. 'మొదటి విషయంలో యెలా వుండాలో నా పెళ్లయ్యాక నన్ను చూసి నేర్చుకుందువు గానిలే' అని సుబ్బారావుకి సానుభూతి చూపిస్తూ చెప్పాడొకసారి గోపాల్రావు.

పెళ్లయిన పదిరోజుల్నించి 'భార్య యేవిధంగా వుండాలి' అన్నది గీతకు నేర్పాలని గోపాల్రావు ప్రయత్నిస్తున్నాడు. కుదర్టంలేదు. ఈ పదిరోజుల్నించీ అత్తారింట్లో కుదర్లేదు. హనీమూన్‌కి వెళ్ళినప్పుడు చెప్పెయ్యాలని నిశ్చయించుకున్నాడు. ఇప్పటికే చాలా లేటయ్యిందని రైల్లో యెక్కంగానే మొదలెట్టాడు గోపాల్రావు.

'గీతా! నువ్వు భగవద్గీత చదివావా ?' అన్నాడు.

'హయ్యోరామ! హాయిగా హనీమూన్ అంటూ బయల్దేరి భగవద్గీతలూ, రామాయణాలూ యేమిటండీ' అంది నవ్వుతూ.

'భగవద్గీతనలా తీసిపారెయ్యకు. దాన్ని గురించి అయ్యే యెస్ పరీక్షల్లో కూడా అడుగుతున్నారు. తెల్సా.'

'ఆఁ ... అవన్నీ యిప్పుడెందుగ్గానీ, మద్రాసులో మనం యెన్నిరోజు లుందామండి ?'

'గీతా! నీ యిష్టం వచ్చినట్టు సంభాషణ మార్చెయ్యకు. నే వడిగినదానికి సమాధానం చెప్పు' కొంచెం బిగ్గరగా అన్నాడు గోపాల్రావు.

భగవద్గీత చదువలేదుగానీ, స్వామి చిన్మయానంద లెక్చెర్లు విన్నాను.'

(ఆఁ...అంతే. మగవాడు కొంచెం గట్టిగా వుండాలిగాని ఆడవాళ్లని కంట్రోల్ చెయ్యటం యెంతపని!! ఒరేయ్. సుబ్బారావ్! నువ్వు మొదట్నుంచీ యిట్లా నా మాదిరుంటే యివ్వాళిలా వుండేవాడివి కావుగదా! పూర్ ఫెలో!)

'చిన్మయానంద లెక్చెర్లు విన్నావు గదా...యింకేం, మంచిదే. గీతకి ఆయన మంచి భాష్యం చెవుతాడు. ఆఁ ... ఈ విషయం చెప్పు— గీతలో వున్న మెయిన్ పాయింటేమిటి ?'

'మాల్ ప్రింక్సు వాడటు పోతున్నా.



[illegible] బాగాను రైళ్ళల్లోనే రోజూ ప్రయాణాలుచేస్తూ బతికేమనిషి కాబోలు. అందుకే రైలు వెళ్ళే వూరిపేరుతో రైలు వివరాలు చెప్పకుండా నంబర్లు చెపుతూ వుంటాడు. అవి మిగతావాళ్ళకి అర్థం కావు. అయినా అలాగే చెప్తారు. కానీ యిలా రైళ్ళలో ప్రతిరోజూ ప్రయాణం చేస్తూ వాటిల్లో జీవించేవాళ్ళల్లో ఒక సుగుణం వుంది. మిగతా వాళ్ళమాదిరి సీట్లకోసం పాకులాడరు, పోట్లాడరు. బండి కదిలేటప్పుడు ఎక్కి డోర్‌దగ్గిరే నిలబడి ప్రయాణం చేస్తారు.

ఎదురుగా వచ్చేది అదేదో...'డౌన్' బండికాదని యింకో అతను వివరించాడు.

'అదా బండిగాదెహె...అది 'వెయ్యాల్ల బండి' అన్నాడు. వాళ్ళు చెప్పిందేవిటో అర్థంగాక గీతవైపు తిరిగాడు.

గీత యింకా నిద్ర నటిస్తూనే వుంది. తల బయటకుపెట్టి చూశాడు. ఇందాకటి సూట్‌కేస్ పెద్దమనిషికి ఈరైలు మద్రాసెడుతుందని నిర్ధారణయి నట్టుంది, యింజనువైపు నుంచొనూ సీటుకోసం కాబోలు పెట్టెల్లోకి తొంగి చూస్తూ వస్తున్నాడు. గోపాల్రావు కిటికీ దగ్గిరమాసి ఆ పెట్టెవైపు రాకుండా పైకెళ్ళి పోయాడతగాడు.

# గీతోపదేశం

'ఈయనకెవరో ఈ రైలెక్కడ కెడుతుందో చెప్పాల్నా వుంది...ఆఁ... ఈయన యెవరో చెవితే వింటాడా? గార్డుచెప్పినా ఈయనకి నమ్మకం కుదర్దు. సరాసరి వెళ్ళి యింజను డ్రయివర్నే అడిగొస్తున్నట్టున్నాడు' అనుకుని నవ్వుకున్నాడు.

గీతని నిద్రలోంచి బయటకు లాగాలనుకున్నాడు. 'ప్లాట్‌ఫారమ్మీదయింత కోలాహలంగావున్నా నిద్రపోతున్నట్టు నటిస్తోంది. ఇంకెలా లేపటం అనుకుంటున్న గోపాల్రావుకి యెదురుగా 'పాన్, బీడీ సిగరెట్లు' అమ్మేవాడు కనిపించాడు. ప్లాట్‌ఫారమ్మీద అమ్మే వాళ్ళందరిలో ఈ 'సిగరెట్టు, బీడీ' అమ్మేవాళ్ళకి యెక్కువ గొంతుంటుందెందుకనో.

'ఏయ్...సిగరెట్లబ్బీ! ఇటొచ్చి మా గీతని లేపు' అన్నాడు గోపాల్రావు కిటికీ దగ్గరకొచ్చి 'పాన్, బీడీ, సిగరెట్' అంటూ అరిచాడతగాడు. గీత వులిక్కిపడి లేచింది.

'ఏవిటండీ ఆ అరుపు?' అంది ఆవలిస్తూ.

'ఆ వక్క పట్టాలమీంచో డీజెలింజను వెళ్ళిందిలే' అని గోపాల్రావాక సిగ



రెట్టు కొనుక్కున్నాడు.

'అబ్బ...మళ్ళీ మొదలెట్టారు వారం రోజుల్నుంచీ లేదు ... పారెయ్యండి' అని సిగరెట్టు లాక్కుని బయట పారేసింది.

'గీతా! నీ యిష్టం వచ్చినట్టు ప్రవర్తించకు. ఇంతవరకూ నీకు వుపదేశం చెయ్యకపోవటం నా పొరపాటు... మొగుడి దగ్గర్నుంచి సిగరెట్టు లాక్కుని బయటకు పారేస్తావ్?! చుట్టూ వున్నవాళ్ళు ఏమన్నా అనుకుంటారన్న జ్ఞానం లేదూ...అదీగాక యింకా నాకూ, సుబ్బారావుకి తేడా యేమిటి?... దిసీస్ ఫైనల్ వార్నింగ్' ... గోపాల్రావుకి నిజంగానే కోపం వచ్చింది.

'నీ టిక్కెట్టు తీసుకుని రైలు దిగేసి టాక్సీ వేసుకుని వెనక్కెళ్ళిపోతాను, జాగర్త' అని టిక్కెట్లు వెతుకుతూ రైలు కదిలేంతవరకూ గడిపాడు.

'వచ్చే స్టేషన్లో దిగేస్తానుండు' అని భయపెట్టి గీతకు దూరంగా జరిగి కూర్చున్నాడు.

గీత కళ్ళవెంట నీళ్ళు తెప్పించింది.

'ఊఁ...ఏడవకు. నే చెప్పినట్టు వింటే, నే చెప్పినట్టు వుంటే దిగిపోను ... అఁ... భగవద్గీతలో మెయిన్ పాయింటేమిటో తెల్సా?'

'ఊహూఁ...' అని తలడ్డంగా ఆడించి 'చెప్పండి' అంది.

'అది ... అలా బుద్ధిగా అడిగి వినాలి. [illegible]



నా టేబుల్ ను ఎప్పుడూ చాలా శుభ్రంగ ఉంచుకుంటానోయ్! దటీజ్ మై హాబిట్!!

సంగతి చెపుతూ నీ పక్కనే వుంటాను... ఆ... భగవద్గీతలో మెయిన్‌పాయింటేమిటంటే...' అని చెపుతూండగా.

'ఎక్స్క్యూస్‌మీ' అంటూ ఒక శాల్తీ గోపాల్రావు పక్కనొచ్చి కూర్చుంది. రైలు కదిలిందగ్గర్నుంచీ గేటుదగ్గరే నిలబడ్డాడులా వుంది. ఇప్పుడొచ్చి గోపాల్రావు దగ్గర కూర్చున్నాడు.

అతగాడి జుట్టంతా దుబ్బులా పెరిగింది. తైల సంస్కారానికా జాబ్జెప్పుడోనే తిలోదకాలిచ్చినట్టుంది. హెయిర్ కటింగ్ సెలూన్‌కి గత యేడాదిలో యెప్పుడూ వెళ్ళినట్టులేదతగాడు. చెంపలమీద సగం వరకూ మగ చెంపలు పెంచాడు. అతగాడు వేసుకుంది టైట్ పాంటేమో ననుకున్నాడు గోపాల్రావు. కానీ అతగాడి పంట్లాం నడుం దగ్గర్నుంచి మోకాళ్ళవరకూ టైట్‌గానే వుంది. కానీ మోకాళ్ళ దగ్గర్నుంచి పైజమా మాదిరి వేళ్ళాడ్తోంది. ఆ జుట్టూ, ఆ అతగాడి డ్రస్సూ... వీటన్నిటితో అతగాడి అవతారం చాలా చిదరగా వుంది.

'అమెరికానుంచి తిరిగొచ్చినట్టున్నారు' అన్నాడు గోపాల్రావతగాడి వైపు తిరిగి.

'తిరిగి రాలేదు. వెకేషన్‌కి వచ్చియున్నాను. తిరిగి అమెరికా వెళ్ళిపోవాలి' అన్నాడు పైపు వెలిగిస్తూ.

'బ్రతికించావ్! తిరిగి వెడతావు గదా' అన్నాడు గోపాల్రావు.

అతగాడి పంట్లాం వంకే చూస్తూ కూర్చున్నాడు గోపాల్రావు. గోపాల్రావు స్నేహితుల బలవంతం మీద రెండేళ్ళనాడు టైట్ పాంటుల్లోకి దిగాడు. అంతకు మునుపు క్రింది భాగం వెడల్పు ఇరవై నాలుగంగుళాలుండేది. స్నేహితుడొకడు గోపాల్రావుకి చివాట్లు పెట్టి—

'ఇంతవరకూ బట్టల మిల్లుల్ని పోషించింది చాలు. పదిహేనంగుళాలు పెట్టించుకో' అని. టైలర్తో—

'టైలరూ! పదిహేనంగుళాలు పెట్టు. ఫోల్డు వద్దు' అని అంటగానే చెప్పాడు.

'బాబ్బాబు! ఫ్రెండూ! ఒక్క తడవ అంతగా మార్తే లాభం లేదు. పదహారంగుళాలు పెట్టింపిప్పుడు. ఫోల్డు కూడా వుంచు, నీ కాళ్ళు పట్టుకుంటాను. ఆ పనిప్పుడే చేస్తాను. టైట్‌పాంటొచ్చాక వంగటం వీలవుతుందో లేదో... ఈ తడవ

'నవ్వుతాడెవరన్నా?... మీ వాళ్లేమైనా ఉత్తరం రాశారా రమ్మని? అయినా అల్లుళ్లు సంక్రాంతికి, దసరాకి వస్తారు గానీ దీనికి రారు. అదీగాక మీ వాళ్లు ఉత్తరం రాయలేదు. అది ముఖ్యం!' అన్నాడు.

'ఎక్కడికని రాస్తారండి? మనమేమో ఊళ్లు తిరుగుతున్నాం...నేనొక్కర్తినీ వెళ్లలేను. మీరూ రండి' అంది.

'ఇది రిక్వెస్టా? ఉపదేశంలాంటి ఆర్డరా?'

'అబ్బే...రిక్వెస్టు సార్... కొన్నాళ్లు గాక ఆర్డర్లు' అంది గీత.

'అదీ..ఆడవాళ్లు రిక్వెస్టు చెయ్యాలి.. మగవాళ్లు ఆర్డర్చెయ్యాలి. తెలిసిందా?' అన్నాడు.

ఇంటికెళ్లంగానే గోపాల్రావు లావుపాటి అత్తగారు—

'ఎలాగో వచ్చావ్‌గా నాయనా! రేపు పండగయ్యాక వెడుదువుగాని' అంది.

'ఇదేం మనిషి ... మర్యాద తెలీదు... యిప్పుడు చెప్పినమాట రిక్వెస్టా?...' అన్నట్టు గీత వంక చూశాడు.

'రిక్వెస్టుసార్...పెద్దాళ్ల రిక్వెస్టు ఇలానేవుంటుంది'అన్నట్టుతలూపినవ్వింది.

'హోహో... అలాగా' అనుకుని గోపాల్రావు కుర్చీలో కూర్చున్నాడు. గోపాల్రావుకి కాస్సేపయ్యాక సుబ్బారావు గుర్తొచ్చాడు.

కానీ సుబ్బారావులో కార్లకి దండాలు పెట్టే వీక్‌నెస్ వక్కటే యిప్పుడు గోపాల్రావుకి గుర్తొచ్చింది.

'వాడిలో యింకేదో వీక్‌నెస్ వుందనే వాళ్లే...ఏమిటబ్బా అది?' అని ఆలోచించిన గోపాల్రావుకి అదేమిటో యెంత సేపటికీ గుర్తుకు రానేలేదు.

పెళ్లయ్యేంతవరకూ ప్రతిమగవాడికీ పెళ్లయిన ప్రతివాడూ భార్యా విధేయుడే మోనన్న వుద్దేశ్యం వుంటుంది. ఆ వుద్దేశ్యం పెళ్లయ్యేంతవరకే వుంటుంది. ●




ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

కల్యాణి ఆ ఆఫీసులో కొత్తగాచేరింది. అక్కడ పని చేస్తున్న వారందరిలోను మురళిపై ఆమెకి సదభిప్రాయం ఏర్పడింది. ఈ సదభిప్రాయమే ఆమెని అతనికి సన్నిహితురాలిగా చేసింది ఆఫీసులో లోటీవాగి విసుర్లు ఆరంభ మయ్యాయి. ఒకరోజు కల్యాణి తన పుట్టుపూర్వోత్తరాలని మురళికి చెప్పకున్నది మురళి పూర్తిగా వినకుండానే ఆమెనుంచి సెలవు తీసుకున్నాడు. కల్యాణి మానసు పరిపరివిధాల పోయింది. ఆమె వేశ్యజాతిలో పుట్టడమే అందుకు కారణం. తను ఎంత నీతిగా బ్రతుకుతున్నా ఈ సమస్య వెన్నాడుతూనే వుంది. మురళి కల్యాణిని పెళ్ళి చేసుకోడానికి సిద్ధమయ్యాడు. చివరికి కల్యాణి, మురళి ఒక్కటి అవడానికి అనుకూల వాతావరణం ఏర్పడింది. కల్యాణి ఉద్యోగం మానేసింది.

## 9

ఉదయం ఏడుగంటలవేళ కల్యాణి అప్పుడే స్నానం అదీ ముగించుకుని వంటప్రయత్నంలో పడింది—

పెరటి తలుపు చప్పుడైతే వెనక్కి తిరిగి చూసి, 'మన్యా మణి రా' అంది. మణి మేడమీదవాళ్ళ అమ్మాయి.

ఆ అమ్మాయి కొన్ని సిగ్గుపడుతున్నట్టు వంకర్లు తిప్పుకుంటూ [illegible] వచ్చి 'ఈ గ్లాసుడు కందిపప్పు ఇమ్మంది మా అమ్మ' అంది.

'ఇప్పుడు ఉండు' అని ఆ పిల్లకి చెప్పి గబగబా చేతిలోవున్న పని పూర్తిచేసి చెయ్యి కడుక్కునివచ్చి ఆపిల్ల చేతిలో గ్లాసు తీసుకుని దాన్నిండా కందిపప్పు పోసి ఇచ్చింది. అది తీసుకుని వెళ్ళి పోయింది మణి.

ఆ ఇంట్లో నాలుగు కుటుంబాలు వుంటున్నాయి. క్రింద రెండు వాటాలు మేడమీద రెండు వాటాలూను.

క్రింది భాగాలలో మురళీ కుటుంబం, దేకపాండే కుటుంబం వుంటున్నారు. మేడమీద గోపాలం కుటుంబం మెహతా వాళ్ళు వుంటున్నారు.

గోపాలం వాళ్ళూకూడ ఈ మధ్యే అంటే మురళీవాళ్ళు ఆ ఇంట్లోకి వచ్చిన వారం రోజుల తరువాత అక్కడికి వచ్చి చేరారు. గోపాలం భార్య కాంత చాలా కలుపుగోలు మనిషి. కలుసుకున్న వేళా విశేషమూ, ఒకేభాషవాళ్ళు కావటం వల్లా కాంతకి కల్యాణిపట్ల ఏదో ప్రత్యేకమైన అభిమానం ఏర్పడిపోయింది— ఒకే ఇంట్లో వుంటున్నందుకు కలిగిన పరిచయంగా స్నేహంగా కాకుండా కాంత ఆత్మీయత పుట్టేవడేలా 'చెల్లాయ్' అని పిలుస్తుంటే కల్యాణి మనస్సంతా నిండి పోయినట్లయేది.

'మనం కలుపుకోటానికి ఏ వరసయినా ఒకటేకాని నాకు చెల్లాయిఅంటే సరదా— నేను మాఇంట్లో అందరికంటె చిన్న దాన్ని. నాకోరిక ఎలా తీరుతుంది. నిన్ను చూడగానే అలా పిలవాలనిపించింది' అని ఆప్యాయంగా నవ్వుతూ కాంత చెప్తుంటే,

'నాకు అదే బాగుంది అలాగే పిలు అక్కయ్యా' అంది కల్యాణి.

ఏడుగురు పిల్లలూ, భర్తా తనూ అంత పెద్ద సంసారాన్ని ఈదుకొస్తూ రోజులో చాలాభాగం వంట ఇంటికే అంకితం అయిపోయే కాంతకి ఇరుగింటికి పొరుగింటికి పెత్తనాలు చెయ్యటానికి తీరికా వుండదు ఆమెకి అంతగా ఇష్టమూ వుండేది కాదు.

ఎప్పుడైనా, మనస్సు మరీ చిరాకుగా వున్నప్పుడు మాత్రం కల్యాణి దగ్గరికి వచ్చి కూర్చుని ఏదో కష్టం సుఖం వెళ్ళబోసుకుంటూవుండేది.

అలా అలా అప్పుడప్పుడూ ఆవిడ చెప్పిన మాటలని బట్టి కళ్యాణికి ఆ కుటుంబం గురించి చాలా విషయాలు తెలిశాయి.

శాంతకి పెళ్ళయి పదేళ్ళయింది— పెళ్ళయిన ఏడాదికే పెద్దకొడుకు పుట్టాడు — వాడుపుట్టిన వత్సరానికి శాంతి అదీ లేకపోయినా తొలిచూలు పుట్టిన మొగబిడ్డకి ఘనంగా బారసాల చేసుక్కోవాలని అటు శాంత తల్లి తండ్రులూ ఇటు గోపాలం తల్లి తండ్రులూ చాలా ముచ్చట పడ్డారు— కాని క్రొత్తగా కన్ఫర్మ్ అయిన వుద్యోగం, ప్రమోషన్‌లిస్టులో తనపేరుకూడ జేర్చబడే సూచనలు వున్నాయి. అలాంటి సమయంలో గోపాలం ఒక్కరోజు కూడ సెలవు పెట్టటం మంచిదికాదని సలహా ఇవ్వాడు ఆఫీసరు.

ఇంకచేసేదిలేక ఆ వేడుకేదో ఇక్కడే చేసుకుంటాం శాంతనీ బాబునీ పంపిం



చేయమని వ్రాశాడు గోపాలం.

మూడునెలల పసివాడిని తీసుకుని వచ్చింది శాంత. ఆ తరువాత రెండు నెలలకే బాలసారె జరిగింది. ఆ వేడుకకి అటు శాంత తల్లితండ్రులూ ఇటు గోపాలం తల్లితండ్రులూకూడా వచ్చారు– ఇరుగుపొరుగు వాళ్ళని గోపాలం ఆఫీసులో వాళ్ళని అందరిని పిలిచి అట్టహాసంగా టీపార్టీ ఇచ్చారు—అమ్మమ్మ చేయించుకు వచ్చిన మురుగులు చేతులకి తగిలించుకుని సిల్కుబుష్‌షర్టు తొడుక్కుని దొర బాబులా వున్న బాబు వీళ్ళచేతుల్లోంచి వాళ్ళచేతుల్లోకి వాళ్ళచేతుల్లోంచి వీళ్ళ చేతుల్లోకి మారుతున్నాడు. వాడిపేరు ఇప్పుడు వెంకటరమణ. వచ్చిన వాళ్ళందరి దగ్గరనుంచీ బహుమతులు కొట్టేసి అందుకు ప్రతిఫలంగా రెండు బుగ్గలూ సొట్టలుపడేలా వాడు వో చిరునవ్వు పారేస్తూంటే ఇంట్లోవాళ్ళకి వూళ్ళో వాళ్ళకీకూడ ముచ్చటగానేవుంది—ఆ తరువాత పదిహేను రోజులదాకా ఆనాటి విశేషాలనీ బాబు చిలిపిచేష్టలనీ తలుచుకు తలుచుకు మరీ మురిసిపోయారు ఆ భార్యాభర్తలు—టీపార్టీ ఖర్చుకి అయితేనేం, వచ్చిన బంధువులకి బట్టలూ అవీ కొనటానికయితేనేం రెండువందల రూపాయిల

# ఆచరణలో ...

అప్పులయినా బాధ అనిపించలేదు వాళ్ళకా సంతోషంలో...

తరువాత ఏడాది తిరగకుండానే శాంతకి అమ్మాయి పుట్టింది. అల్లుడికి ఆ వార్త వ్రాస్తూ పిల్ల నక్షత్రానికి చాలా శాంతి చేయించాలనీ హోమాలూ జపాలూ చేయించాలనీ వ్రాశాడు శాంత తండ్రి. అలాంటివాటిలో తనకి నమ్మకం వున్నా లేకపోయినా, పెద్దవాళ్ళ ఎలాగా వూరుకోరనీ క్రితం సారిలా ఇక్కడ చేసుకుంటే మళ్ళీ ఆ ఖర్చంతా తడిసి మోపెడవుతుందనీ గోపాలం నాలుగురోజులు శలవు పెట్టి వెళ్ళి పని జరిపించుకు వచ్చాడు.

తరువాత కొద్దిరోజులకి శాంతా పిల్లలూ వచ్చారు. ఇక్కడ ఇంట్లో పని ఇద్దరు పిల్లల్ని చూసుకోటం శాంతకి కొంచెం అలసటే అనిపించేది.

'ఆ. అందరూ చేసుకోటం లేదు ?— నాలుగురోజులు పోతే ఈ నీరసం అదే సర్దుకుంటుంది.' అని లక్ష్యపెట్టకుండానే రోజులు గడిపేసేది. ఒకవేళ ఎప్పుడైనా గోపాలందగ్గర ఆ మాట అంటే. 'ఓ యబ్బ, ఇద్దరు పిల్లలు పుట్టేసరికే నువ్విలా తయారయితే మీ అమ్మా మా అమ్మా పదేసిమంది పిల్లల్ని కని వీళ్ళాపెంచి పెద్దవాళ్ళని చేశారనుకున్నావు?' అనేవాడు పెద్దగా నవ్వుతూ.

శాంత నీరసంగా నవ్వేసి వూరుకునేది–మరో సంవత్సరం గడిచింది. శాంతకి మళ్ళీ పురిటి రోజులు—వో సాయంకాలం గోపాలంతో పాటు ఇంటికి వచ్చి, కాస్సేపు కూర్చుని వెళ్ళిన వో స్నేహితుడు తరువాత కాస్త చనువుగానే అతన్ని హెచ్చరించాడు. 'నీ మిసెస్ చాలా వీక్‌గావున్నారు. టానిక్కులూ అవీ ఇప్పిస్తూనే వున్నావనుకో— అయినా పిల్లల విషయంలో కాస్త స్పేసింగు వుండాలి— నాలుగేళ్ళకి ముగ్గురు పిల్లలంటే తల్లిఆరోగ్యమూ పాడవుతుంది పిల్లలూ బలహీనంగానే వుంటారు—ఇంకనుంచి కాస్త జాగ్రత్తగా వుండు.'

గోపాలానికి సర్రున వచ్చింది కోపం. అయినా అతన్నేమీ అనటం ఇష్టంలేక ఎలాగో తమాయించుకున్నాడు. కానీ యింటికి వచ్చాక మాత్రం 'ప్రతివాడికీ ఇదో జబ్బు—ఫామిలీ ప్లానింగో అంటూ వెధవగోల — కనిపించిన వాళ్ళందరికీ సలహా లివ్వాలని చూస్తారు—నాపెళ్ళాం బిడ్డల బరువు అక్కడికి తనేదో మోస్తున్నట్టున్నది వాడి ధోరణి — పెట్టి పోషించేవాడిని నాకులేని బాధ మధ్య వాడికెందుకో.' అంటూ ఆ రోజల్లా రుంజుకుంటూనే వున్నాడు.

సరే ఆ తరువాత అయిదేళ్ళల్లోనూ మరో నలుగురు పిల్లలు పుట్టారు.

మూడో పురుడు దగ్గరనుంచీ శాంత కాన్పుకి పుట్టింటికి వెళ్ళటం మానేసింది — అవేళ్టికి సహాయంగా వుండటానికి ఆమెతల్లో అతనితల్లో వచ్చేవారు—

ఇంచుమించు సంవత్సరానికోసారి. ఆ ఖర్చులూ, పెరుగుతున్న సంసారం, రోజు రోజుకీ పెరిగిపోతున్న ధరలు, నిత్యావసరాలు గడవటమే గగనమై పోతోంది—పసిపిల్లకి పాలడబ్బాలు ఎడపిల్లకి మందుసీసాలు ఇంకా పెద్దవాళ్ళకి స్కూలుజీతం ఇలా ఖర్చులు పెరిగిపోతున్నాయి. పిల్లలకి పట్టుమని తలో నాలుగు జతల బట్టలయినా లేవు — గోపాలం ఆఫీసుకికూడ కాస్త చిరుగులు పట్టి దారప్పపోగులు రేగిపోయిన పంట్లా



ములా కాలర్ చిరిగిపోయిన షర్టులా వేసుకు వెళ్తున్నాడు. ఇంక శాంత వరే వరి చిరుగులూ, కుట్లూ కనిపించకుండా చీర కట్టుకోటానికి వీలుకానంత పాత చీరలు కూడా కట్టుకుని కాలక్షేపం చేస్తోంది. పెళ్ళినాటికి బొద్దుగా అందంగా, ముద్దబంతి పువ్వులా వుండే శాంత ఈనాడు పాలిపోయిన మొహం చప్పి దవడలు, గుంటలుపడ్డ కళ్ళతో పస్లుగా ఈనెపుల్లలా తయారయింది.

తొమ్మిదేళ్ళనాడు ఘనంగా పెద్దవాడి బారసాల జరుపుకుని అట్టహాసంగా స్నేహితులందరికీ విందుచేసిన అతను ఇవాళ కన్నబిడ్డలకి కడుపునిండా బలమైన ఆహారం అయినా ఇవ్వలేక పోతున్నాడు, పోనీ తనేమైనా చేతులు ముడుచుకుని కూర్చున్నాడా అంటే అదేం లేదు. వచ్చి మున్నమయి వోవర్‌టైములు కూడ పనిచేస్తాడు. నిజం చెప్పాలంటే పదేళ్ళ క్రిందటికి ఇప్పటికి అతనిజీతం నెలకి నో నూరు రూపాయిలపైనే పెరిగింది. అయినా దాంతో నెలంతా గడవటమే లేదు— మధ్యలో అక్కడా, ఇక్కడా చేబదుళ్ళు చెయ్యటం జీతం రాగనే అవి తీర్చటం, మళ్ళీ పదిహేనో తారీకునే అప్పుకి బయలు దేరటం.

'ఛీ— వెధవ బ్రతుకు' అని ఎన్నిసార్లో తమ జీవితాల్ని తామే తిట్టుకుంటారు ఆ భార్యాభర్తలు— అయినా ఆ జీవితాలు అలాగే సాగిపోతున్నాయి.

అదీ వాళ్ళ సంసారం—

* * *

మెలుకువ వచ్చినా లేవబుద్ధికాక ట్రాన్సిస్టరు అలా ప్రక్కని పెట్టుకుని వార్తలు వింటూ పడుకున్న మురళీ వార్తలు సమాప్తం అన్న తరువాత ట్రాన్సిస్టరు ఆపేసి లేచి రగ్గు మడతపెట్టి ఇవతలకి వచ్చాడు.

వంటింట్లో కళ్యాణి కత్తిపీట ముందు పెట్టుకుని దొండకాయలు చక్రాలలా తరుగుతోంది. 'ఇంకా ఏనిమిదయినా కాలేదు. అప్పుడే నీ స్నానం అదీ అన్నీ అయిపోయి నట్టున్నాయి. ఎందుకీ హడావిడి. ఇంత చలిలో చీకటితో లేవటం ఎందుకు ఏదో మించిపోయినట్లు' అన్నాడు గడపదగ్గర నిలబడి లోపలికి చూస్తూ.

'బాగుంది ఆరుగంటలకి లేవటం కూడ త్వరగా లేవటం క్రిందే లెఖ్ఖా ఏమిటి?— అబ్బా చలీ అనుకుంటూ రగ్గు ముసుగు పెట్టుకుని పడుకుంటే ఆ చలి ఎంతకీ వదల్దు— చీకటితో లేచి గబగబ మొహం కడిగేసుకుని, ఆవళంగా కుళాయి శుభ్రరంగా విప్పేసి దాని క్రింద కూర్చున్నామంటే చలిగిలి అన్నీ ఒక్కసారిగా ఎగిరిపోతాయి......'

'అయితే నువ్వు చన్నీళ్ళ స్నానం చేశావా?'

'లేదు లెండి బాబూ, మాటవరసకేదో అంటే పట్టుకుంటారు— త్వరగా వెళ్ళి మొహం కడుక్కురండి— కాఫీ కలుపుతాను.' అంది కళ్యాణి కత్తిపీటా కూరముక్కల పళ్ళెం వో వారకి పెట్టి, అవి తరిగినదగ్గర జాగా శుభ్రం చేస్తూ.

'అవును గాని— పైవాళ్ళ పాప పొద్దున్నే వచ్చినట్లుంది ఎందుకూ?' అన్నాడు మురళీ యాదాలాపంగానే అడుగుతూ.

'ఆ...ఏదో...కాస్త కందిపప్పు కావాలని వచ్చింది ... నెలాఖరుకదూ వాళ్ళ ఇంట్లో నిండుకున్నట్లుంది...'

'ఏదోలే పాపం ...మనమేం వూరికే ఇవ్వటంలేదు. అదీ వందలూ వేలుకాదు. ఈ మాత్రంగానైనా మనిషికి మనిషి సాయం చేయలేకపోతే ఎలా... ఏ దడిగినా విసుక్కోకుండా ఇస్తూ వుండు' ఆ కుటుంబంట్ల జాలి, సానుభూతి వున్నాయి అతని కంఠంలో.

'బాగుంది నేనెప్పుడు లేదన్నాను? ఒక్కోసారి కొన్నికొన్ని మనకే చాలవేమో అనిపించినా ఆమాట పైకి చెప్పకుండా ఏదో సర్దుబాటుచేస్తూ వుంటాను' అంది.

మురళీ మొహం కడుక్కోటానికి బాత్‌రూమ్ వేపు వెళ్ళిపోయాడు.

* * *

ఉదయం పదిగంటలు దాటింది.

కూరలూ గుణాలూ:

## బూడిద గుమ్మడి కాయ

ఇది చలువ చేసి నీరు పెడుతుంది. పొట్టను మృదువు పరుస్తుంది. మంచి రక్తాన్ని పుట్టిస్తుంది. నీరుడు బాగా అయేటట్లు చేస్తుంది. పాండు రోగులకు మేహ, కాక శరీరులకు యిది పథ్యమయినది. విదాహం కడుతుంది.

లేత పొత్తి కడుపును శుభ్ర పరుస్తుంది. వీర్యపుష్టిని, బలాన్ని చేకూరుస్తుంది. కఫం, పైత్యం, శ్లేష్మం, వాతం, మందాగ్ని, గ్రహణి, మూత్రకృచ్ఛం, మూత్రాశ్మరి, అతిమూత్రం క్రిమిరోగం, ప్రమేహం, మేహపైత్యం, గలవారికిది మేలు చేస్తుంది. దీనితో ఉడికించి కాచిన నీళ్ల ఆవిరి పట్టిన సవాయిపుళ్ళు తగ్గుతాయి.

ముదిరినకాయ గుంజారసము విరేచనకారి. దేహపుష్టి నిస్తుంది. దీని మురబ్బా విరేచనకారి, క్షయ రోగులకిది బాగా పనిచేస్తుంది.

పది తులముల దీని గుంజారసములో పసుపుగుండ నూరు గోధుమ గింజల ఎత్తు, ఎరడా బియ్యపు తవుడు నూరు గోధుమ గింజల ఎత్తు కలిపి అయిదారు దినములు ఉదయం సాయంత్రం యిచ్చిన అతి మూత్రం తగ్గుతుంది.

దీని కూర గురుత్వం, అగ్ని మాంద్యం చేస్తుంది. దీనికి విరుగుళ్లు:—1. జీలకర్ర 2. పుదీనా 3. లవంగాలు 4. జీర్ణౌషధములు.

బూడిద గుమ్మడికాయ వడియాలు మినపప్పుతో చేసినవి వాతాన్ని, వాశ్మర్యరోగాన్ని ఉపశమింపజేస్తాయి. వీర్య పుష్టిని, బలాన్ని యిస్తాయి. గురుత్వాన్ని, వేడిని కలుగజేస్తాయి. విరుగుడు ఉప్పువేసిన కలి.

సేకరణ:— అకుండి నారాయణమూర్తి

ఆఫీసులో స్టాఫంతా ఎవరి సీట్లలో వాళ్ళు కూర్చుని పని వ్రాసుకుంటున్నారు.

పోస్టుమాన్ వచ్చి వుత్తరాల కట్ట యాద్‌గిరి చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు. ఒక్కసారి ఆ హాల్లో వున్న అందరూ చేస్తున్నపని మానేసి తలలు తిప్పి యాద్‌గిరి వంక చూశారు. ప్రతిరోజూ ఆ వేళ్టికి పోస్టు రావటం స్టాఫంతా అలా ఆసక్తిగా ఆశగా ఆ వుత్తరాల వంక చూడటం అది మామూలే.

యాద్‌గిరి వుత్తరాలమీది ఎడ్రసులు చూసి ఓ కవరు మురళీ టేబిలుమీద పెట్టి మిగిలినవి తీసుకుని మేనేజరు గదిలోకి వెళ్ళిపోయాడు.

'అయ్యో ఇవాళ మన ఎవ్వరికీ లేనే లేవా? ఈ ప్యూన్‌ముండావాడు సరిగ్గా చూశాడో లేదో' అంటూ అంగలార్చాడు కామేశ్వరరావు. అతనీమధ్య సెలవుపెట్టి వెళ్ళి ఓ పెళ్ళికూతుర్ని చూసివచ్చాడు. చూసి చూడగానే ఆ అమ్మాయి అతనికి నచ్చింది. ఆ సంగతే తండ్రికి చెప్పి ఇంక ముహూర్తం పెట్టించేయమని చెప్పి వచ్చేశాడు. తండ్రి దగ్గరనుంచి కాని కాబోయే మామగారి దగ్గరనుంచి కాని వుత్తరం వస్తుందని ఈ పదిహేను రోజులనుంచీ ఎదురు చూస్తూనే వున్నాడు. పాపం, రోజూ నిరాశే ఎదురవుతోంది. ఆ అమ్మాయికి తను నచ్చలేదేమో అన్న వూహ మాత్రం అతనికి రాలేదు. అందుకే రోజూ ఆ వుత్తరంకోసం చూస్తున్నాడు—

## ఆచాణాలో...

'ఎవ్వరికి రాకపోవటమేం మురళీధరరావుగారికి వచ్చిందో కవరు వుత్తరం.' అన్నాడు జనార్దనం కామేశ్వరరావుని ఇంకా వుడికించాలని

'ఆ తెలుసు' అన్నాడు కామేశ్వరరావు. ఆ వుత్తరం అసలు తనదే కాకూడదా, పొరబాటున ఆ బంట్రోతు మురళీ చేతికి ఇచ్చివుండకూడదా అని లోలోపల కోరుకుంటూ.

మురళీ ఆ కవరుని ఓసారి ఇటు తిప్పి అటు తిప్పి చూశాడు. ఎడ్రసు వ్రాసినవారి దస్తూరీ ఎవరిదై వుంటుందో అతనికి చటుక్కున గుర్తురావటం లేదు. వ్రాసినవారి పేరూ ఎడ్రసూ వుంటుందేమోనని చూశాడు— లేదు. ఉత్తరం మాత్రం చాలా బరువుగావుంది. అదనంగా స్టాంపులు అతికించారు. 'ఎక్కడ్నించి అయివుంటుంది?' అనుకుంటూ గబగబ కవరు చించి కాగితాలు పైకి లాగాడు. ఆ మాత్రంగా పేజీలు తిప్పేసి చివర సంతకం చూశాడు. ఆ పేరు చూస్తూనే విస్తుపోయాడు.

అతని చెల్లెలు వైదేహి వ్రాసిన వుత్తరం అది. ఇంత పెద్ద వుత్తరంలో చెల్లాయి ఏం వ్రాసివుంటుంది? తను పెళ్ళిచేసుకోగానే వ్రాసిన వుత్తరానికి సమాధానంగా 'ఇంక నీకూ మాకు ఎలాంటి సంబంధమూ లేదు.' అంటూ తండ్రి వ్రాసిన కార్డు ఒకటి వచ్చింది. ఆ తరువాత జీతం అందుకోగానే అదివరకులాగే ఇంటికి కొంత డబ్బు పంపించాడు. 'ఇంకముందు నీ డబ్బు మాకు అవసరంలేదు. నువ్వు పంపినా మేము తీసుకోము' అన్న జవాబుతో అది తిరిగివచ్చింది. ఆ తరువాత ఈ నాలుగు నెలల్లోనూ వాళ్ళ సంగతులేమీ తెలియనే లేదు. ఇప్పుడు ఇందులో ఏం వ్రాసి వుంటుంది?

అతని మనస్సు కీడుని శంకిస్తూ భయంతో దడదడ లాడింది — మంచిని ఆశిస్తూ సంబరపడి ఆ వుద్వేగంతో గబగబ చదవటానికి వుపక్రమించాడు. రెండు వాక్యాలయినా చదవకముందే

'సాబ్ బులా రహేహైం.' అంటూ వచ్చాడు రహీం.

ఒక్కసారి వాడిని నమలకుండా మింగేద్దామా అన్నంత కోపం వచ్చినా, ఇంక చేయగలిగిందేమీ లేదన్నట్లు, విసుగ్గా కాగితాలు డ్రాయరులో పడేసి లేచి వెళ్ళాడు.

మేనేజరు అడిగినవాటి కన్నింటికి ఓపిగ్గా సమాధానాలు చెప్పాడు. అతను తృప్తిగా తల వూగిస్తూ అంతా విని, ఇంక నువ్వు వెళ్ళవచ్చును అన్నట్లు చెప్పగానే ఇవతలికి వచ్చి మళ్ళీ ఆత్రంగా వుత్తరం తీశాడు. అది సగం అయినా కాలేదు.

'అయ్యగారు పిలుస్తున్నారు' అంటూ. ఈ సారి యాద్‌గిరి వచ్చాడు.

'నా ప్రాణానికి ఒకడు చాలనట్లు ఇద్దరు బంట్రోతులు తయారయ్యారు.' అన్నట్లు వాడివంకచూసి మళ్ళీ వుత్తరం లోపల పెట్టి లేచివెళ్ళాడు.

ఈ సారి సప్లయిలూ స్టాక్ పొజిషనూ అంతా డిస్కసుచేస్తూ ఓ గంటసేపు కూర్చోపెట్టాడు మేనేజరు— విధిలేక కూర్చున్నట్లు కూర్చుని అంతా విని తోచిన సమాధానాలు చెప్పి ఇవతలికి వచ్చాడు.

ఆ తరువాత ఎలాగో గబగబ వుత్తరం చదవటం ముగించాను అనిపించాడు కాని అతనికేమీ తృప్తిగా లేదు. సావకాశంగా మరోసారి చదువుకోవాలనిపించింది — పైగా ఆ వుత్తరం చదివిన దగ్గరనుంచీ మనస్సుకి కుదురు లేకుండా పోయి ఏవేవి



చెయ్యి బుద్ధి కావటం లేదు. అయినా మరీ అర్జెంటు అనిపించిన పనిమాత్రం ఎలాగో పూర్తిచేసి, 'ఇంట్లో కొద్దిగా పని వుంది' అని మేనేజరుకి చెప్పి ఆఫీసు లోంచి ఇవతల పడ్డాడు.

తిన్నగా యింటికి వెళ్ళి బట్టలయినా మార్చుకోకుండా జేబులోంచి కాగితాలుతీసి చదవటం మొదలుపెట్టాడు.

అన్నయ్యా.

ఈపాటికి నువ్వు అమ్మనీ నాన్నగారినీ మమ్మల్నందర్నీ మరిచిపోయి వుంటావు — మేమంతా కూడ నిన్ను పూర్తిగా మరిచిపోవాలనేదే నాన్నగారి ఆజ్ఞ — మాకులంటే చెప్పేశారు కాని తమమాత్రం నిన్ను మరిచిపో లేకపోతున్నారు. ఇక అమ్మ అయితే నిన్ను గుర్తుచేసుకోని క్షణం లేదు దిగులుతో కుమిలిపోని ఘడియలేదు.

అసలు నీ పెళ్ళివార్తని మోసుకొచ్చిన ఉత్తరం ఈ ఇంట్లో ఎలాంటి సంచలనాన్ని కలిగించిందో ఎలాంటి వాతావరణాన్ని సృష్టించిందో చెప్తాను.

ఆవాళ మధ్యాహ్నం మూడుగంటల వేళ—నేనుకూడా నాన్నగారితో ఏదో మాట్లాడుతూ వీధి వరండాలోనే వున్నాను. పోస్టుమాన్ వచ్చి నాన్నగారిచేతిలో ఇన్‌లాండ్ కవరుపెట్టి వెళ్ళిపోయాడు.

'ఆ—పెద్దాడు వ్రాసిందే' అంటూ సంబరంగా కవరు విప్పటానికి ప్రయత్నించారు. అప్పటికి కొద్ది రోజుల క్రితంనుంచీ రోజూ మాకు నీ పెళ్ళి ముచ్చట్లు చెప్పుకుని మురిసిపోటంతోనే సరిపోతోంది. అంటే ఆవాళ మనంఅంతా వెళ్ళిచూసిన అమ్మాయి బాగనే వుంది. నీకూ నచ్చిందనే మేమంతా అనుకున్నాము. ఆ విషయం స్పష్టంగా వ్రాస్తూ పెళ్ళి ఎప్పుడు చేస్తే నీకు వీలుగా వుంటుందో వ్రాస్తావని రోజూ నీ వుత్తరం కోసం ఎదురుచూస్తున్నాము — ఊరికే ఎదురుచూస్తూ కూర్చోటం కాదు, నీ పెళ్ళికి నాకువచ్చే ఆడబడుచు లాంఛనాలతో బెనారస్ చీరలు కొనుక్కోవాలనీ, పెళ్ళికూతురుకి ముత్యాల నెక్లెసు పెట్టాలనీ— అట్టే ఆలశ్యంకాకుండా అంటే నేను పురిటిమంచం ఎక్కి కూర్చోక ముందే నీ పెళ్ళి జరిగిపోతే బాగుంటుందనీ ఏవేవో ఖబుర్లు చెప్పుకుని మురిసిపోతూండే వాళ్ళం—

సరే, నాన్నగారు ఏం చెప్తారో వినాలనీ, ఆయన చెప్పకముందే ఆయన కుర్చీవెనక నిలబడి ఆ వుత్తరం గబగబ చదివేయాలనీ ఆత్రపడుతూ లేవబోయిన నేను నాన్నగారి మొహంచూసి బిత్తరపోయి అలాగే కూర్చుండిపోయాను. ఆయన్ని అంత రౌద్రమూర్తిగా నేను ఆదివరకు ఎప్పుడూ చూడలేదు— తన కళ్ళని తనే నమ్మలేకపోయినట్టు ఆ వుత్తరం తనది అవునా కాదా అన్నట్టు ఒక్కసారి వెనక్కీ ముందుకీ తిప్పి మరోసారి చదువుకున్నారు. అంతే చర్రున చించేసి ఆ కాగితం ముక్కలు అవతలపారేసి లేచి వెళ్ళి గదిలో పడుకున్నారు.

భయంతో బిగుసుకుపోయి కూర్చుండిపోయిన నేను కొంచెం సేపటికి తెలివి తెచ్చుకున్నదానిలా మెల్లిగా వంటగదిలోకి వెళ్ళాను. అక్కడ అమ్మ కాఫీ చేస్తోంది. నేను అలా గుమ్మందగ్గర నిలబడే మెల్లిగా జరిగిందంతా చెప్పాను.

'ఏమిటీ? అబ్బాయి వుత్తరం వ్రాశాడా, దాన్ని నాన్నగారు చింపి పోగులుపెట్టారా? ఏమిటే నువ్వుచెప్పేది— ఏదీ— ఆ కాగితం ముక్కలిలా పట్రా' అంది.

ఆ ఆలోచన నాకు రానందుకు నన్ను నేనే తిట్టుకుంటూ గబగబా వాకిట్లోకి వెళ్ళాను. కసిగా నలిపి వుండ చుట్టి పారేసిన కాగితంముక్కలు అక్కడే వున్నాయి ఇంకా గాలికి ఎగిరిపోకుండా. గబగబా వాటిని ఏరుకుని అమ్మదగ్గరికి వచ్చాను.

వంటగదిలో ఓ పీటవాల్చి దానిమీద ఆ ముక్కలన్నింటినీ ఎలాగో ఓ క్రమంలో పేర్చగలిగాను. అది చదువుతూంటే



ఇటీవల కలకత్తా ఆంధ్ర సంఘంవారు ఏర్పాటుచేసిన నాట్యప్రదర్శన సందర్భంలో తీసిన చిత్రం. ఆంధ్ర సంఘం అధ్యక్షులు శ్రీ మూర్తి, ముఖ్య అతిథి శ్రీ నీలకంఠం, కార్యదర్శి శ్రీ రావు తదితరులను చిత్రంలో చూడవచ్చు.

'అయ్యో—అమ్మా—అన్నయ్య.' అన్న మాటలు మాత్రం అప్రయత్నంగానే నా నోటినుంచి వెలువడ్డాయి. తరువాత ఏం చెప్పాలన్నా ఎంత ప్రయత్నించినా నా నోట మాట రానట్లే అయింది.

'ఏమిటే అన్నయ్యకేమయిందే.' అంది అమ్మ కళ్లంట నీళ్లు పెట్టుకుంటూ.

'అన్నయ్యకి ఏం కాలేదమ్మా — భోగంవాళ్ల అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు.' అన్నాను ఎలాగో గొంతు పెగుల్చుకుని. అమ్మ కొయ్యబారి పోయి పట్టున కూర్చుండి పోయింది. ఒక్క క్షణం. ఆ తరువాత 'ఏమిటే నువ్వు చెప్పేది—నేను నమ్మను నాబిడ్డ అలాంటి పని చేయడు.' అంటూ ఒక్క వుదుటున లేచివెళ్లి దేముడి మందిరం ప్రక్కని అల మారులో పెట్టుకున్న కళ్లజోడు తెచ్చుకుని పెట్టుకుని పీట దగ్గరకి వచ్చి ఆ పత్రికలోకి సంశయంగా భయంగా చూసింది. అంతా అర్థం అయింది. అంతే అలాగే అక్కడే గోడకి జేర్లబడి కూలబడిపోయి కొంగు కళ్లకి అడ్డం పెట్టుకుని ఎంతసేపు కుమిలిపోయిందో నేను చెప్పలేను. ఆవిడ పడుతున్న బాధని రెండు కళ్లలోటి చూస్తూ అలా నిల బడి పోయానే కాని ఆవిడని ఎలా ఓదార్చాలో ఏమని నచ్చచెప్పాలో నాకు తెలియ లేదు.

## ఆచరణలో …

చివరికి ఏం తోచిందో లేచి గబ గబ నాన్నగారి గదిలోకి వెళ్లింది. నేనూ ఆవిడ వెంటే వెళ్లి గుమ్మం దగ్గర నిల బడ్డాను.

నాన్నగారు కళ్లకి చేయి అడ్డంపెట్టుకుని ఓ ప్రక్కకి వత్తిగిలి పడుకుని వున్నారు.

'ఏమండీ, ఇది నిజమే అంటారా—నాకు నమ్మకం కలగటంలేదు—వాడంటే కిట్టని వాళ్లెవరో లేనిపోనివి పుట్టించి వ్రాసి వుంటారు.' అంది అమ్మ వెర్రి ఆశ ఏదో మనస్సులో పెనుగులాడుతూండగా.

'హుఁ — కిట్టనివాళ్ళు —ఇలాంటివి పుట్టించే విరోధులు ఎవరుంటారు — అయినా—అయినా వాడి చేతివ్రాత తెలియటం లేదూ—తను చేసిన ఘనకార్యాన్ని వాడు గొప్పగా తన చేతులతో స్వయంగా మనకి వ్రాశాడే ! ఇంకా మనకి అను మానం ఎందుకు ?...ఇంకో మాటకూడ వ్రాశాడుగా, మనకి చెప్పకుండా తను చేసిన ఈ పనిని మనం క్షమించ గలిగితే తనూ భార్యా ఓసారి వస్తామని — రానక్కర్లేదని ఇవాళే రాసి పడేస్తాను— ఇంత అప్రతిష్ఠ పనిచేసి వూళ్లో మనం తలెత్తుకు తిరగలేకుండా చేసిందే కాకుండా దాన్ని వూళ్ళోకి మన యింట్లోకి తీసుకొచ్చి మన ప్రతుకుల్ని యింకా నవ్వుల పాలు చేస్తాడులా వుంద.'

అన్నారు నాన్నగారు. ఆయన గొంతు ఎంత బింకంగా పలికిందో అంత ఆర్ద్రంగా కూడ వుంది. అవధులు లేని ఆగ్రహంతో ఆవేదనతో ఆయన అంతరంగం కుత కుత లాడిపోతోందని ఎవ్వరైనా గ్రహించు కుంటారు.

'ఇదంతా నేను చేసుకున్న ఖర్మ ... కాకపోతే నా కడుపుని పుట్టిన బిడ్డ ఇలా వంశానికి మచ్చ తెచ్చే పనిచేస్తాడని ఏనా డైనా అనుకున్నామా.' అంది అమ్మ నుదురు కొట్టుకుంటూ.

'ఖర్మ మరి—తల్లిదండ్రులకి తల వంపులు తెచ్చేపని బిడ్డలు చేశారూ అంటే అది పెద్దవాళ్ల దురదృష్టమే' అన్నారు నాన్నగారు.

ఇంతలో కుసుమా శేషూ స్కూలు నుంచి వచ్చారు. నేను వాళ్లిద్దర్నీ ముందుగానే పెరట్లోకి తీసుకు వెళ్లిపోయి సంగతంతా వివరించి చెప్పాను.

పెరటి వరండామీద నేను చెల్లాయి తమ్ముడు బిక్క మొహాలు వేసుకుని కూర్చుండి పోయాము చీకటి పడేదాకా. ఆ రాత్రి ఇంట్లో వంటప్రయత్నమే లేదు అంటే నువ్వు నమ్మలేవేమో.

సరే ఎలాగో తెల్లవారింది. నిత్య కృత్యాలన్నీ పేరుకి యథావిధిగానే జరుగుతున్నాయి. మేం పిల్లలం ఎలా వున్నా అమ్మా నాన్నగారూ ఎంతగానో కృంగి పోయారు. వీధిమొహం చూడాలంటేనే వాళ్లకి ప్రాణం చచ్చిపోతున్నట్లుగా వుంది—ఇవాళ కాకపోతే నాలుగు రోజులు పోయాకయినా నలుగురికీ తెలియదా — వాళ్లకేంచెప్తాం అని బాధపడిపోతున్నారు.

అమ్మ నీ సంగతులన్నీ, నువ్వు చిన్న తనంలో చేసిన అల్లరి దగ్గరనుంచి ఏవేవో కబుర్లు చెప్తూ వుంటుంది. అవి తలుచుకోటం బాధపడటం మామూలయి పోయింది—ఒకసారి, అంటే నువ్వు బి.ఎల్. చదువుతూండగా అనుకుంటా శర్మగారి అమ్మాయిసంగతి చెప్పిందిట కదూ అమ్మ నీకు ...'

చదువుతున్న కాగితాల మీదనుంచి దృష్టి మళ్లించి ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చాడు మురళీ—అవును ఆ సంఘటన అతనికి బాగా జ్ఞాపకం వుంది.

(ఇంకా ఉంది)

బ్రదర్. ఈసారి నిన్ను అప్పడుగటానికి వచ్చానని భయపడకు.. ఏంలేదు అర్జంటుగా నీ రిస్ట్ వాచి యిస్తావ్-పేకాట పెడుతున్నా..



పాండవుల అజ్ఞాతవాసం పూర్తి అయాక — కౌరవులు ఉపేక్ష చెయ్యగా-ఏదో ఒక విధంగా సంధి చేసుకోవాలనే సర్వజనులక్షేమం కోరిన ధర్మరాజు అభిప్రాయం. అది ద్రౌపది కెంతమాత్రం యిష్టం లేదు. సంధి కుదిరితే ఆమె ప్రతిజ్ఞ నెరవేరదు గదా! శ్రీ కృష్ణుడు రాయబారిగా వెళ్లాడేగాని—సంధి కుదరదనే అతని నిశ్చితాభిప్రాయం. దుష్టులైన రాజులను నశింపజేసి భూభారాన్ని తగ్గించడానికి అవతరించిన శ్రీకృష్ణుడికి సంధి కుదరక పోవడమూ సమ్మతమే! అర్జునుడికి స్వధర్మ నిర్వహణకోసం గీతోపదేశం చేసింది యుద్ధం జరగాలనే కదా!

ద్రౌపది శక్తి అపరావతారం! ప్రళయమే ఆమె సంకల్పం! ఇది కృష్ణుడికి తెలుసు. పాండవులను ఆ యుద్ధ ప్రళయాన్నుంచి రక్షించాలని ఆయన సంకల్పం!

యుద్ధానికి ముందు శ్రీకృష్ణుడు ఒకనాడు భీమ్ముణ్ణి పిలిచి 'బావా! అలా షికారుకు వెళ్లివద్దాం రా' అని కొంతదూరంగా ఉన్న చిన్న అడవికి తీసుకుపోయాడు. అక్కడ ఒక చెట్టుచూపి, దానిపై ఎక్కి కూర్చుని, ఏమి జరుగుతున్నదీ గమనిస్తూ ఉండాలనీ, తాను చెప్పే వరకూ చెట్టు దిగవద్దనీ అన్నాడు. భీముడు 'అలాగే' అంటూ చెట్టెక్కి కొమ్మల చాటున కూర్చున్నాడు.

కొంచెం సేపటికి ఇద్దరు దేవ పురుషులు వచ్చి చీపుళ్లతో ఆచెట్టు క్రింది ప్రదేశం ఊడ్చి శుభ్రం చేశారు. ఇంకొకడు ఒక సింహాసనం వేశాడు. కొంచెం సేపటిలో బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన



# ద్రౌపది యిచ్చిన వరం

ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

వేల్పు పెద్దలతో కూడా దేవత లందరూ వచ్చి కూర్చున్నారు. ఇంతలో తల విరియబోసుకుని వున్న ద్రౌపది చాలా కోపంతో తొందరగా రాగా, దేవతలంతా లేచి చేతులుజోడించుకుని నిలుచున్నారు. ఆమె సింహాసనంపైని కూర్చున్నది. ఎదుట శ్రీకృష్ణుడు నిలుచున్నాడు. ఆమె అతనిని చూచి 'ఇంకా ఎంత కాలం నిరీక్షించమంటావు? యుద్ధం వేగం జరిగి ప్రజానాశం అయితేగాని నాకు తృప్తికలగదు. ఆలస్యాన్ని ఇక సహించను' అన్నది. శ్రీకృష్ణుడు చేతులు నులుపు కొంటూ 'శీఘ్రంగానే మీ సంకల్పం నెరవేరుతుంది' అని అన్నాడు 'సరే చూస్తాం గదా!' అంటూ ఆమె లేచి వెళ్లిపోయింది. దేవతలూ, సింహాసనమూ — మాయం కాగా, శ్రీకృష్ణుడు మాత్రం నిలిచి ఉన్నాడు.

ఈ సంఘటనను చూస్తున్న భీముడు కొయ్యబారి పోయాడు. 'దిగవలె'నని శ్రీకృష్ణుడు పలికిన మాట విని ఎలాగో కిందికి దిగి 'ద్రౌపది సంగతి యిప్పటికిగాని తెలియలేదు' అన్నాడు. 'ఆమె శక్తి స్వరూపిణి, ప్రళయానికే ఆమె ఉద్భవించింది. యుద్ధంలో ఉభయ పక్షాలవారూ మరణించక తప్పదు. మీ సోదరులు అయిదుగురూ తప్పించుకొనుటకు ఒక ఉపాయం ఉన్నది. ద్రౌపది సమాచారం తెలిసినట్లుకాక — నీవు మామూలుగానే ఆమెతో కలిసి మెలిసి ఉండు. ఆమెకు ఎంతో ఉత్సాహంగా ఉన్నప్పుడు తొందరగా 'నీ కేమిటి కావాలో అడుగు' అంటుంది. అప్పుడు 'తల్లీ! మా అయిదుగురు సోదరులం జీవించి ఉండేటట్లు వరం ఇయ్యి' అని ప్రార్థించు' అన్నాడు.

భీముడు ఒకవైపు బెదురుతూనే ఆమెతో యథాపూర్వంగా వుండేవాడు. ఒకనాడు శ్రీకృష్ణుడు చెప్పిన సమయం వచ్చింది. ఆమె 'ఏమికావాలి?' అని అడుగగా— శ్రీకృష్ణుడు చెప్పిన మాదిరిగానే భీముడు కోరాడు అప్పుడు ద్రౌపది 'ఆ నల్లవాడు పన్నిన పన్నాగమా యిది? సరే, అలాగే జరుగుతుందిలే' అని నవ్వుతూ చెప్పింది.

పాండవుల పుత్రులు యుద్ధంలో మరణించినా, పాండవులు మాత్రం బ్రతికి బయటపడ్డారు.

[ఈ కథ పెద్దలు ఎప్పుడో చెప్పగా విన్నది; కల్పితం కాదు. ఏ పురాణంలో ఇది ఉన్నదీ తెలియదు. దీని సత్యాసత్యాలకోసం చర్చ అనవసరం']

## జరిగిన కథ

ప్రేమించినవాడు మోసం చేశాడని కుమిలి పోతున్న రాధ అతను వస్తున్నాడని ఉత్కంఠగా ఎదురుచూసుకుని మురిసిపోయింది. పెళ్ళి చూపులకని వచ్చిన సీతారాం రాధని గుర్తించాడు. రాధని తన భార్యగా పరిచయం చేసి అందర్నీ ఆశ్చర్య పరిచాడు. అతనెవరో తనకి తెలియదు అని ఏడ్చింది రాధ. అంతా రాధని పిచ్చిదని నిర్ణయించు కున్నారు. ఆమె ఒక బిడ్డకి తల్లి అని డాక్టరు కూడా చెప్పడంతో వారినిర్ణయం ధృవపడింది. రాధ సీతారాంని తెలియదు అని అనడంలో ఏదో గూఢ రహస్యంవుందని ప్రేమారావు అభిప్రాయం. రాజశేఖరం హఠాత్తుగా ప్రవేశించాడు. అతను నా భర్త అంది రాధ. రాధ ఎవరో నాకు తెలియదని వెళ్ళిపోయాడు రాజశేఖరం. రాధ తన పాపని ప్రేమారావు దగ్గర వెళ్ళి చూసుకుని వచ్చింది. ప్రేమారావు ఆమెని రాజశేఖరం వద్దకి తీసుకెళ్ళాడు. రాజశేఖరం మళ్ళీ తిరస్కరించాడు.

---

## పన్నెండు

స్థలం : మొదటి రంగస్థలమే.

[పాపని భుజాలమీద వేసుకుని పచార్లు చేస్తున్నది రాధ. లలిత నిద్రపోవడం గమనించి లోపలికి తీసుకుపోయింది. వంటరిగా వచ్చింది. దిగులుగా బెంచీమీద కూర్చున్నది]

ప్రేమారావు:—[వచ్చాడు] అమ్మా...... రాధమ్మా......!

రాధ:—[అటు చూసింది. ఆమెకి ఏడుపు ముంచు కొచ్చింది.]

ప్రేమారావు :—అమ్మా......పాప ఎలా వుం దమ్మా......?

రాధ : [ఉలిక్కిపడి లేచింది.] ఎందు కొచ్చా విక్కడికి? ఇంకా ఏం ఘోరం చెయ్యాలని వచ్చావు? ఆ చంటిది ఏన్నేం చేసిందని విషం పెట్టావు....? బ్రతికింది గనక సరిపోయింది. దానికి గనక ఏమైనా అయితే నేను ప్రాణాలతో వుంటాననే అనుకున్నావా? ఇందర్ని కష్టపెట్టి నువ్వు ఏం బావుకుందామను కున్నావు......?

ప్రేమారావు : అమ్మా......! రాధమ్మా....! మీ రే నా ఇలా మాట్లాడుతుంటు......? మీరు కూడా నమ్ముతున్నారా......? పాపకి విషం పెట్టేనంటే మీరూ నమ్ముతున్నారా.....? పాప మన పెరిగినోరు. తస్సారవలా, అంత కిరాతుకం నా సేతులతో ఎలా సేత్తాననుకున్నారమ్మా....? పాప నా పేణమని మీకు తెలుసు. అంత పాపం నేనెలా సెయ్య గల్గుతాననుకున్నారమ్మా.....? సెప్పం డమ్మా......! తస్సారవలా.....ఎవల్లో ఈ పని సేసి నా మీదకి తోసేశారమ్మా.....నేనే పాపం ఎరుగ నమ్మా......మీ పాదాల సాచ్చి.....!

రాధ : హు.....ఎవరికి మాత్రం అంత పని చెయ్య డానికి చేతు లొస్తాయి......?

ప్రేమారావు:తస్సారవలా, అయిదవాని నేనే సేసి వుంటే—మళ్ళీ మీ ముఖం సూడగల్గుతానా అమ్మా! పోలీసోళ్ళు నా కోసం మూలమూలలా గాలిస్తు న్నారు. కళ్ళ కంట్లో కారంగొట్టి ఇలా తప్పించు



కొచ్చాను, పాప సేమం తెలుసుకోవాలని...మిమ్మల్ని సూడాలని దొంగ సాటుగా వచ్చాను. నే ననుమంటో తుంటే.....మళ్ళీ వస్తారంటారా.....?

రాధ : పోనీ, నువ్వు చెప్పు. నీకు ఎవరిమీద అను మానంగా వుంది......?

ప్రేమారావు : [జేబులోంచి ఫోటో తీశాడు ఈ ఫోటో సూడండి. ఈ ఫోటోలో వున్న మనిషి మీకు తెలుసా? సెప్పండి. తస్సారవలా అన్ని అన్నాయా లకీ ఎవరు కారణమో యిట్టే తెలిసిపోద్ది....

రాధ : [ఫోటో చూసింది] ఇది నీ కెలా వచ్చింది?

ప్రేమారావు : ముందు ఈ మాట సెప్పండి ఈ ఫోటోలో వున్నోళ్ళు మీకు తెలుసా?

రాధ : నాకు తెలియక పోవడమేమిటి? ఈమె నా ప్రాణ స్నేహితురాలు.

ప్రేమారావు : పేరు లలితేనా అమ్మా....?

రాధ : అవును.

ప్రేమారావు : [కళ్ళల్లో నీళ్ళొచ్చాయి. గద్గదికంగా అన్నాడు] అమ్మా.....లలితా....!

రాధ : మాణిక్యం.....ఏమిటలా అయిపోయావు..?

ప్రేమారావు : అమ్మా.....! మీరు రాజశేఖరం బాబుగారితో ఒక కథ చెప్పారు. ఆ కథ ఈమెదేనా.? సెప్పండమ్మా.....సెప్పండి.

రాధ : అవును. ఈ ఫోటో గురించి నీ కెంత ఆరా ఎందు కొచ్చిందిప్పుడు?

ప్రేమారావు : వచ్చింది గనకనే అడుగుతున్నా నమ్మా......

రాధ : ఈ అమ్మాయి నీకు తెలుసా?

ప్రేమారావు : [ఫోటో తీసుకున్నాడు] అవు నమ్మా......! బాగా తెలుసు. తస్సారవలా.....ఈ సేతులతో పెంచిన తల్లమ్మా యిది.....! నా సెల్లి అన్నాయంగా బలైపోయిన నా తల్లి....నా ముద్దుల సెల్లి......[ఏడ్చేశాడు.]

రాధ : మాణిక్యం......!

ప్రేమారావు : అవును తల్లీ.....నిజం.....!

రాధ : మాణిక్యం.....!ఇంతకాలమూ ఈ రహస్యం తెలీనేలేదు. లలిత నీ చెల్లెలా? పాప నీ చెల్లెలి కూతురు! లలిత పేరే పెట్టాను. నీ మేనగోడలది. పోనీలే.....ఇప్పటికయినా నిజం తెలుసుకున్నాం నాకిప్పు డెందుకో చాలా సంతోషంగా ఉంది మాణిక్యం...!

ప్రేమారావు : అవునమ్మా......తస్సారవలా..... యిశాదంలోనే సంతోసం....! సంతోషంలోనే యిశారం......! మనిద్దరి జీవితాలూ ఒకటే నమ్మా......!

[పోలీసు విజిల్స్ వినిపించాయి]

రాధ : మాణిక్యం.....!అదిగో పోలీసులు నీకోసం గాలిస్తున్నారు. వెళ్ళు. నువు పారిపో.....!

ప్రేమారావు : హా.....పారిపో.....! తస్సారవలా..... యింతకాలానికి ఈ ప్రేమారావుగాడు పారిపోయే స్థితికి వచ్చాడు. పోలీసులకి బయపడే స్థితికి వచ్చాడు. నాయానికి రోజుల్లేవమ్మా....

రాధ : నువ్వెళ్ళు.....మళ్ళీ పోలీసులు వచ్చేస్తారు..... వూ.....!

ప్రేమారావు : వెళ్తానమ్మా.....వెళ్తాను. తస్సారవలా, ఆ రాక్షసుడ్ని పట్టుకుని నరికి పోగులెట్టే వరకూ నిద్దరోను. అమ్మా.....రాధమ్మా.... పాప జాగర్త. ఆ పాప నా పేణమని గేపకం ఉంచు కోండమ్మా......! యెళ్తున్నా.....[వెళ్ళిపోయాడు]

రాధ : మాణిక్యం.....!

ప్రేమారావు : ఏమ్మా....

రాధ : జాగ్రత్త.....!

ప్రేమారావు : [విరక్తిగా నవ్వాడు. కళ్లు తుడుచుకున్నాడు.]

[మళ్లీ పోలీసు విజిల్స్ వినిపించాయి. వెళ్లి పోయాడు. రాధ కూడా లోపలికి వెళ్లిపోయింది.]

—తెర—

## పదమూడు

స్థలం : రెండవ రంగస్థలమే.

[రాధ పత్రిక తిరగేసింది. మనసు దాని మీదకు పోవడంలేదు. పుస్తకం మూసి షెల్ఫులో పెట్టేసింది. ఆమెకి నిద్ర వస్తోంది. లైటు ఆఫ్ చేసింది. బెడ్‌లాంప్‌మాత్రమే వెలుగుతోంది.సోఫాలోపడుకుంది.

సీతారాం వచ్చాడు. నెమ్మదిగా దొంగతనంగా ఆమె మంచం దగ్గరికి చేరాడు. సిగరెట్టు దమ్ము లాగుతూ ఆమెని పరీక్షగా చూశాడు. అతనికి మత్తెక్కింది. పశువులా ఆమె మీద పడ్డాడు.

రాధ లేచింది. అరవబోయింది. సీతారాం ఆమె నోరు నొక్కేశాడు. ఆమెని బలవంతం చేయబోయాడు.]

సీతారాం : రాధా.....! అనవసరంగా గొడవ చెయ్యకు. అర్థరాత్రి. మనం భార్యాభర్తలమని అందరికీ తెలుసు. ఏం గొడవ చేసినా నీకే నష్టం. నా ఓర్పుకి నువ్వు పెట్టిన పరీక్షచాలు. ఇంక నేను ఆగలేను. . . . . గొడవ చెయ్యకు లొంగి పో....

[రాధ అతన్నుంచి తప్పించుకోడానికి ప్రయత్నించింది. లోపలికి పరుగెట్టింది. ఆమెని వెన్నాడాడు సీతారాం. ఇవతలి గదిలోకి పరుగెట్టింది. మళ్లీ వెన్నాడాడు సీతారాం. అక్కడ ఆమెని పట్టుకున్నట్టు న్నాడు. కేకలు వినిపించాయి. విడిపించుకుని స్టేజి మీదకు వచ్చింది.]

కె. నానారావు : [అమాంతం స్టేజిమీదకు తుపాకీతో ప్రత్యక్షమయ్యాడు.] కమాండర్....కమాండర్..... ఎక్కడ? చైనావాళ్ల పారిస్తాను వాళ్లా? ఏకమయ్యారు. పెద్ద బలగంతో దురాక్రమణ చేసేస్తున్నారు. బాంబులు వేసేస్తున్నారు. ఎవరక్కడ? ఎక్కడ చూసినా శత్రువులే. ఎక్కడ చూసినా శత్రుకూటమి. జవాన్లూ నిద్రలేవండి. సోల్జర్స్.... బీ......అలర్ట్! శత్రువుల్ని పట్టుకోండి.... ఫయిర్. ఫయిర్. .....

రాధ : నాన్నా..... [అంటూ అతన్ని కావలించుకొంది]

[సీతారాం మళ్లీ రంగంమీదికి వచ్చాడు. అతన్ని చూసింది. తండ్రిని చూసింది. అతన్ని గట్టిగా కావలించుకుంది.]

కె. నానారావు : ఎవరూ..... కమాండర్...... కమాండర్.....! ఈ కారడవిలో ఒక స్త్రీగొంతు. ఈ కీకారణ్యంలో ఒక ఆర్తనాదం! ఇంపాసిబుల్... ఇంపాసిబుల్...... శత్రువులు నన్ను మోసం చెయ్యలేరు.......

[తండ్రి తనని రక్షించే స్థితిలో లేదని పోలీసులకి ఫోన్ చేద్దామని టెలిఫోన్ దగ్గరికి వెళ్లింది. అదీలాభం లేదని తెలుసుకుని బయటికి పారిపోయింది]

ఇదిగో తుపాకీ ... మర తుపాకీ ... కాసుకోండి ... కాసుకోండి? ఇరుగో శత్రువులు ఇటే వస్తున్నారు. ఇటే వస్తున్నారు. ఈ చెట్టుచాటున దాక్కుంటాను. సైలెన్స్..... తుపాకులు సిద్ధంగా వుంచండి.... రెడీ ఫర్ ఫయర్..... ష్....! [కొంతసేపు నిశ్శబ్దం.... తర్వాత అలికిడైంది. అటుచూశాడు.] దొరికాడు శత్రువు. దొరికాడు. హాండ్సప్.....! ఏమిటి చేస్తున్నావు......? పవిత్రమైనది మా భారతదేశం. దేశదేశాలూ మా దేశాన్ని గౌరవిస్తాయి.....! పూజిస్తాయి.... మా తల్లి దేశం మీదనా నీ దురాక్రమణ .....! ఎందుకు దురాక్రమణ చేస్తున్నావు.....?నిన్ను చిత్రవధ చేస్తాను. కాకులకీ గెద్దలకీ ఎగరేస్తాను... పూ...... కాసుకో!

[సీతారాంని గట్టిగా పట్టుకున్నాడు..., సీతారాం, నానారావుని తోసేశాడు. నానారావు పడిపోయాడు. అతని తలకి గాయం తగిలింది. స్పృహతప్పిపోయాడు.

నానారావుని చూశాడు. సోఫావెనక అతన్ని పడుకోబెట్టాడు. సిగరెట్టు కాలుస్తూ హడావిడిగా తిరుగాడు. అతనికి రాధ కనిపించలేదు.]

సీతారాం: రాధ పారిపోయింది ఇప్పుడెలా? ఏం చెయ్యాలి? ఇక రాధ నన్ను భర్తగా స్వీకరించడం కల్ల. ఆమెని వశపరచుకోవడం కలలో మాట.....! ఇంక యిక్కడ నాకు స్థానంలేదు.ఈ ముసలిపీనుగ చచ్చాడో బ్రతికాడో...? ఇక్కడనుంచి ఎంత తొందరగా వెళ్లిపోతే అంతమంచిది. ఛీఛీ..... ప్లానంతా నాశనమైపోయింది.

[జేబులోంచి తాళం తీశాడు. బీరువా తెరిచాడు. అందులో.... డబ్బూ..... నగలు బ్రీఫ్‌కేస్‌లో వేసుకున్నాడు. పారిపోవాలని ఒక అడుగు ముందుకు వేశాడు ప్రేమారావు అదే సమయానికి వచ్చాడు.]

సీతారాం : ఎవరు.....! ఓ, నువ్వా ప్రేమారావూ ......! రా.... నీకోసం పోలీసులు తెగవెతుకుతున్నారు నా కూడారా.. ఫిఫ్టీ ఫిఫ్టీ....... హాయిగా వుందాం. నీకేం ప్రమాదం రాకుండా నేను చూస్తాను.

ప్రేమారావు : అరి తస్సారవలా..... నాకేం ప్రమాదం రాకుండా నువు చూస్తావా...? ఫిఫ్టీ ఫిఫ్టీయా......?

సీతారాం : అవును. గొడవ చెయ్యకు. అంతా లేస్తారు.

ప్రేమారావు : [లైటు వేశాడు]

సీతారాం : ఎందుకు లైటు వేస్తావు? మన మిక్కడనుంచి ఎంత తొందరగా పారిపోతే అంత మంచిది. పోలీసులు వస్తారు. నువ్వు చాలాప్రమాదంలో యిరుక్కుపోతావు

ప్రేమారావు : తస్సారవలా....నామీద నీకు సాలా పేమ పుట్టకొచ్చిందే? రారు. పోలీసులు రారు. మన మిక్కడనుంచీ పారిపోయేవరకూ రారు. ఫిఫ్టీ ఫిఫ్టీ అంటున్నావుగా. సరే....! ఈమధ్యలో మనం ఒక రాజీ కొద్దాం! [జేబులో ఫోటో తీశాడు. అతని ముఖం దగ్గర పెట్టాడు.] ఈ ఫోటోలోఅమ్మాయి నీకేమన్నా గేపకముందా......?

సీతారాం : అబ్బే.....,ఎవరీమె...? నాకేం తెలియదే......?

ప్రేమారావు : నువ్వు పూరికే బొంకి ప్రయోజనం లేదు. తస్సారవలా. ఇప్పుడు నీ పేణం నా గుప్పిట్లో వుంది. రాజశేఖరంగోరికి అంతా తెలిసిపోయింది. ఆయన వచ్చేస్తున్నారు. ఈ నాటితో నీ ఆటకట్టు. చెప్పు నిజం చెప్పు...ఈ అమ్మాయికీ నీకూ ఏమీ సంబంధం లేదా....?

సీతారాం : వూ....అనవసరంగా గొడవచెయ్యకు ప్రేమారావు. ఇప్పుడా విషయాలన్నీ ఎందుకు చెప్పు. ముందు ఇక్కడినుంచి బయట పడదాం. తర్వాత అన్నీ మాట్లాడుకోవచ్చు.

ప్రేమారావు : తస్సారవలా......సేతులో సిక్కిన సేపని అంత తొందరగా యిడిసి పెడతా నను కుంటున్నావా.....? సెప్పు.....నీకు తెలియదా?

సీతారాం : తెలియదు.

ప్రేమారావు : తెలియదూ.....! తస్సారవలా.... నువ్విలా నిజం చెబుతావా.....[కత్తి తీశాడు] సెప్పు రాస్కేల్.......సెప్పు......ఈ అమ్మాయి నీకు తెలవదూ......? నువ్వు దాన్ని మోసం సెయ్యలేదూ? ఇది నా సెల్లెలురా....నాసెల్లెలు. అల్లారు ముద్దుగా పెంచుకున్న సెల్లెలు. దాని జీవితాన్ని సర్వ నాశనం సేశావు. దాని బతుకు అన్యాయం అయిపోయింది. అప్పట్నించి నీ కోసం.....ఈ సమయంకోసం కళ్లల్లో వత్తులేసుకుని ఎదురు సూత్తున్నా ..... నాకు సినిమా యాసాలు కాదురా కావాల్సింది. తస్సారవలా.....నువ్వు, నువ్వురా నువ్వు. యెదవ నాయాల. ఇప్పటికి దొరికావు. నీరక్తం కళ్ల జూస్తా రాస్కేల్......దొంగ ఉత్తరాలు, దొంగ ఫోటోలు సూపించి రాధమ్మ జీవితాన్ని కూడా నాశనం సేద్దామని సూసేవురా.....నా సెల్లెల్ని నాశనం సేశావు... అది సాల్లేదురా.....సూడు నిన్నేం సేత్తానో...?

[ఇద్దరూ కలియబడ్డారు...]

సీతారాం : [అలిసిపోయాడు] వుండు...చెబుతా నుండు.

ప్రేమారావు : [వదిలాడు] సెప్పు....!

సీతారాం : లలితా నేను ప్రేమించుకున్నాము. పెళ్లి చేసుకోవాలనుకున్నాం. నేను పెళ్లికి అన్ని ఏర్పాట్లూ చేసుకుని వచ్చేసరికి లలిత ఆత్మహత్య చేసుకు చచ్చిపోయింది. అందులో నా తప్పేమీ లేదు.

ప్రేమారావు : అదిగో మళ్లీ అదే కూత....! నువ్వు నా సెల్లెల్ని మోసంచేసి పారిపోలేదురా....? నీ వల్ల కాదూ......నా సెల్లెలు సచ్చిపోలా? నా సెల్లెలి బతుకు పాడు సేశావు. ఆ సెల్లెలి గేపకంగా వున్న ఒక్కగా నొక్క పసివానికి విషం పెడతావా......? పాపాత్ముడా.... విన్నేం జేసినా పాపం లేదురా.....

సీతారాం : ఏమిటీ? పాప.....! లలిత కూతురా? నా కూతురా... ..?

ప్రేమారావు : అవున్రా దుర్మార్గుడా! అవును. ఆపాప నీపాపఫలితం సేసినపాపాలు సరిపోక కన్నకూతురికే యిసం పెట్టావు. నీలాంటి నీసుడు ఈభూమ్మీద వుండకూడదు.

[కత్తితో పీక మీదకి రాసాగాడు. సీతారాం తప్పించుకోవాలని శత విధాలా ప్రయత్నించాడు. చివరి ఆయుధంగా బ్రీఫ్‌స్‌లో ప్రయోగించాడు దానితో కొట్టాడు. ప్రేమారావు తలమీదగట్టిగా

తగిలింది. పడిపోయాడు. సీతారాం కత్తి తీసి జేబులో వేసుకొని పారిపోబోయాడు.]

రాజశేఖరం : [వచ్చాడు. పారిపోబోతున్న సీతారాం కాలరు గట్టిగా పట్టుకుని వెనక్కి లాక్కువచ్చాడు]

సీతారాం: [విడిపించుకుంటూ] ఎవరు నువ్వు....?

రాజశేఖరం : ఆ మాట అడగాల్సింది నేను. చెప్పు......! ఎవరు నువ్వు .....?

సీతారాం : నువ్వెవరు నన్ను నిలదియ్యడానికి?

రాజశేఖరం : పిచ్చి పిచ్చిగా వాగబోకు. ఇక్కడింత గొడవ జరిగింది. ఏమీ ఎరగనట్టు మాటాడకు.

శాంతమ్మ : [వచ్చింది.] ఏమిటిది? ఈ ఇంట్లో ఏం జరుగుతోంది? ఏమిటిదంతా....? రాధ ఎక్కడా?

రాధ : [అప్పుడే వచ్చింది. ఆమె బాగా అలిసిపోయింది.] నేను ఇక్కడే వున్నాను. [రాజశేఖరాన్ని చూసింది] మీరా....? వచ్చారా......? నన్ను కరుణించారా?

రాజశేఖరం : రాధా......ఏమిటీ అవతారం? అర్ధరాత్రి......ఎక్కడికి వెళ్లావ్ .....?

రాధ : ఈ దుర్మార్గుడు నామీద అత్యాచారం చెయ్యబోయాడు. పోలీసులకి ఫోన్ చేసి వస్తున్నాను.

[ప్రేమారావుని చూసింది. ప్రేమారావు ముఖం మీద నీళ్ళు జల్లింది. ప్రేమారావు తేరుకున్నాడు]

సీతారాం : భర్తగా నాకుమాత్రం అధికారం లేదూ ...... చూశారా అక్కయ్యా .....! ఎంత ఘోరం తలపెట్టారో......? ఈ మాణిక్యంగాడూ ఇతగా డ్రైవర్నీ వెంటబెట్టుకువచ్చి మన యిల్లంతా దోచుకోడానికి ప్రయత్నం చేశాడు. నేను ఎదుర్కొనేప్పటికి.......నామీద తిరగబడ్డారు... చూడండి ఎంతకి తెగించారో.....?

# పద్మవ్యూహం

రాజశేఖరం : నోర్ముయ్......! స్కౌండ్రల్...! వెధవ పేలాపన పేలావంటే డొక్క చించేస్తాను. వుండాకోర్....! నిజం చెప్పు.....ఎవరు నువ్వు....?

సీతారాం: చెప్పండక్కయ్యా.....మీరు చెప్పండి... నేను మీ అల్లుణ్ణికాదూ......?

రాజశేఖరం : రాస్కెల్......అల్లుడివట్రా....? ఎవరికిరా నువ్వు అల్లుడివి? చెప్పు......ఈ ఇంట్లో ఎందుకు ప్రవేశించావ్.....? ఏ ఉద్దేశంతో ప్రవేశించావ్.....? చెప్పు. లేకపోతే ప్రాణాల్తో విడిచిపెట్టను.

సీతారాం : అక్కయ్యా.....చెప్పండక్కయ్యా.... వీడెవడో నన్ను చంపేసేలాఉన్నాడు. చెప్పండక్కయ్యా ఏమిటలా చూస్తున్నారు?

రాజశేఖరం : అక్కయ్యేం చెబుతుందిరా? చెప్పాల్సింది నువ్వు. నువ్వు ఎన్ని ఎత్తు లేసినా, ఎన్ని నాటకాలాడినా యిక్కడినుంచి బయట పడలేవు. నీ పాపం బద్దలైంది. కాస్సేపటకి పోలీసులు వస్తారు. నువ్వు తప్పించుకోలేవు. ఈలోపులో నిజం చెప్పి నీ పాపాల్ని కడిగేసుకో......వూ....చెప్పు. [కొట్టాడు.]

సీతారాం : చెబుతాను. నన్ను వదలండి.

రాజశేఖరం : చెప్పు. ఈ యింటి కెందుకొచ్చావ్?

సీతారాం : చెబుతాను....అంతా చెబుతాను... వినండి.

[అని సౌమ్యంగానే అంటూ కత్తి బయటికి తీసి విజృంభించాడు. వికటాట్టహాసం చేస్తూ రాజశేఖరంమీదకు రాబోయాడు. ఇద్దరూ పెనగులాడారు. ఆ పెనగులాటలో సీతారాం కింద పడిపోయాడు. కత్తి ప్రమాదవశాత్తూ అతని కడుపులో దిగిపోయింది. అతి కష్టంమీద లేచాడు. లేచి రక్తం చూసుకున్నాడు. అతని నవ్వు ఏడుపు రూపం దాల్చింది.....]

సీతారాం : చెప్తాను. అంతా చెప్తాను. నా పాపం ఈ నాటితో పండిపోయింది. నా కళ్ళు తెరుచుకున్నాయి. ఇంకా ఎందుకు దాచుకోవడం......? వినండి......అంతా వినండి. ఈ యింట్లో ఎందుకు ప్రవేశించానో చెబుతా వినండి. అవకాశం కలిసొచ్చింది. వచ్చాను. ఇంట్లో ప్రవేశించాను. అందమైన అమ్మాయి, అంతులేని ఆస్తి నా కళ్ళు కప్పేసింది. యింట్లో, నేను అక్కర లేదనుకున్నా, అన్ని సదుపాయాలూ జరిగాయి. సిరి వస్తుంటే మోకాలడ్డే వారెవరుంటారు? అవకాశాన్ని ఎలా విడిచిపెట్టుకుంటారు? నన్నుఅందలమెక్కించినశాంతమ్మగారి నడగండి. నేను, వెళ్లిపోతానన్నా వెళ్ల నివ్వలేదు. అడగండి. చెబుతారు.

శాంతమ్మ : ఓరి నీ దవుర్భాగ్యం కూలా....! అల్లుడినని చెప్పి ఎంత మోసం చేశావురా....?

రాజశేఖరం: నీకా ఉత్తరా లెక్కడినుంచివచ్చాయి? చెప్పు!....

సీతారాం : దొంగతనం చేశాను. నా వృత్తే అది. ఆ పెట్లో ఈ ఆధారాలన్నీ దొరికాయి. వాకబు చేశాను. యింటి పరిస్థితుల్నీ స్థితిగతుల్నీ బాగా ఆకళింపు చేసుకున్నాను. ఈ యింట్లో పెళ్లి కొడుకులా వచ్చి అల్లుడిగా స్థిరపడ్డాను.

రాజశేఖరం : మరి ఫోటో....?

సీతారాం : నాకు ఫోటోగ్రఫీ తెలుసు. ట్రిక్‌చేసి రాధప్రక్కన నా ఫోటోకలిపి ప్రింట్ చేశాను. అత్యాశకి పోయాను. అందుకు ఫలితం అనుభవించాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు.

ప్రేమారావు : నిన్ను దేవుడుకూడా క్షమించడు కన్నకూతురికే విషం పెట్టిననీచుడివి.....

శాంతమ్మ : ఏమి టేమిటీ.....?

సీతారాం : ప్రేమారావుమీద నేరం బలంగా వుండాలని..... రాధకి సాయం చేస్తున్న అతన్ని యింట్లోంచి వెళ్ళగొట్టాలని ఆ పని చేసింది నేనే.....! రాధకీ నాకూ మధ్య అడ్డు తొలగి పోతుందనుకున్నాను. కన్న కూతురని తెలియక......అంత రాక్షసత్వానికి పాల్పడ్డాను......

రాధ : దుర్మార్గుడా.... నీ వల్ల ఎంతమంది బలైపోయారు ?

శాంతమ్మ : అయితే పాప నీ కూతురేనా.....? అయ్యో రాధమ్మతల్లీ........! నిన్నెంత క్షోభ పెట్టానమ్మా.....! అక్కడికీ నువు పోరాడుతూనే వున్నావు తల్లీ! ఇదిగో.... ఈ దొంగవెధవ మా కళ్ళు కప్పేశాడు. ఆ చీకట్లో మా కింకేమీ కనిపించలేదు.

[రాధని దగ్గరికి తీసుకుంది.]

నీకుపెళ్ళిచేసి ఇంట్లోనుంచి తొందరగా పంపించేసి ఆస్తినంతా నెత్తినేసుకు పోదామని, బుద్ధి గడ్డి తిని, నీకు అన్యాయం తలపెట్టాను తల్లీ.....! నన్ను మన్నించు.

రాధ : అంతమాటెందుకులేవమ్మా.....!

శాంతమ్మ : [రాజశేఖరంతో] ఆపద్బాంధవుడిలా వచ్చారు. ఎవరు బాబూమీరు? మీ మేలు జన్మజన్మలా






# సౌందర్యము మరియు తాజాదనపు భావన...సింథాల్ సబ్బుతో

మీ కోసము...అపూర్వమైన సౌందర్యము. రోజంతా
తాజాదనము... రెండు విధములుగా పనిచేసే సింథాల్ సబ్బుతో.
సింథాల్ లో ప్రపంచములో కెల్ల ఎంతో బాగుగా పనిచేసే
క్రిమినాశిని జి-11 (హెక్సాక్లోరోఫీన్) ఉంది.

జి-11 గల సింథాల్ మాత్రమే మిమ్మల్ని అందముగా
తాజాగా ఉంచగలదు.




## సింథాల్ నిజంగా దుర్గంధ నివారిణి సబ్బు

మురచిపోలేం. మా కళ్ళు తెరిపించారు.

ప్రేమారావు : తస్సారవలా.... ఆయనేనమ్మా.... మీ అసలు అల్లుడుగోరు...... రాజశేఖరంగోరు. రాధమ్మగోరిని ఏలుకోడానికి ఒచ్చేరు. తస్సారవలా.. రాధమ్మగోరికింక కట్టాలే లేవు. బ్రతుకంతా పండగే.

రాధ : [సిగ్గుపడింది]

రాజశేఖరం : నేనూ రాధని చాలా బాధ పెట్టాను. అగ్ని పరీక్షకి నిలబెట్టాను. రాధకి పెళ్ళయి పోయిందని అనుమానపడి, అనవసరంగా హింసించాను. రాధ నా దగ్గరికి వచ్చింది. వుత్తరాలు, ఫోటో గురించి చెప్పినప్పుడు నా అనుమానం రిపోయింది. నా దగ్గర వుండే ఉత్తరాలూ ఫోటో నా దగ్గరలేవు. నా పెట్టె దొంగతనం జరిగిన సంగతి జ్ఞాపకంవచ్చింది. ప్రేమారావు చెప్పినదానితో నా అనుమానం పూర్తిగా తొలగిపోయింది. ఇంతకాలమూ నా రాధ పద్మవ్యూహంలో చిక్కుకుని వూపిరిసలపకుండా అలమటిస్తున్నదని అర్థమయింది. ప్రేమారావును ముందు పంపించి నేను వచ్చాను. రాధకి క్షమాపణలు చెప్పుకోవాలని వచ్చాను.

శాంతమ్మ : పోనీలే నాయనా..... మంచిపనే జరిగింది. కష్టసుఖాలు కావడికుండలన్నారు. భగవంతుడు సమయానికే మీకు మంచి బుద్ధి పుట్టించాడు మా రాధమ్మతల్లి అదృష్టమే అదృష్టం.....!

[రాధ, రాజశేఖరం చేతులు కలిపింది.]

ప్రేమారావు : తస్సారవలా.... నాకిప్పుడు పట్టరానంత సంతోసంగా వుంది.

శాంతమ్మ : ఒరే ప్రేమారావూ... నువ్వు నా కన్నా చిన్నోడివి. అయినా గుణం గొప్పది. నిన్నుచాలా బాధ పెట్టాను నన్ను మన్నించు నాయనా.

ప్రేమారావు : తస్సారవలా....., అదేంటండమ్మాగోరూ.....! మీరు పెద్దలు అలా అనకూడదు....,

[ఇన్‌స్పెక్టరు, పోలీసులు వచ్చారు.]

సీతారాం : రండి ఇన్‌స్పెక్టరుగారూ.....! నేను చెయ్యని నేరం లేదు. ఏ శిక్షకయినా నేను తగినవాడినే..... బేడీలు వెయ్యండి.

[చేతులు చాపాడు. పోలీసులు బేడీలువేశారు.]

ఇన్‌స్పెక్టరు : [అతని ముఖంలోకి చూశాడు] నువ్వా.....? మారుపేర్లు పెట్టుకుని ప్రజల్ని

# పద్మవ్యూహం

మోసపుచ్చడంలో మొనగాడివికదూ..... [రాజశేఖరంతో] ఇతను పాతకేడీ సార్.....! ఇతని మీద చాలా నేరాలున్నాయి. ఇంపర్సనేషన్..... ఫోర్జరీ..... చీటింగ్...... దొంగతనాలూ..... చాలా చాలా..మా వాంటెడ్ లిస్టులో వున్నాడు. చాలా థాంక్స్.....! మీ వల్ల ఇతన్ని పట్టుకో గలిగాం. వన్‌ఫార్టీఫోర్.... వన్‌ఫార్టీఫైవ్.... ఇతన్ని జీప్‌లో కూర్చోబెట్టండి. జాగ్రత్త......

సీతారాం : ఇన్‌స్పెక్టరుగారూ.....! ఒక్క నిమిషం.....! ఒక్కసారి రాధమ్మతో మాట్లాడనివ్వండి. అమ్మా.... రాధమ్మా.....! క్షమించమనడానికికూడా నాకు నోరు రావడం లేదమ్మా...... మీ రన్నారు నా బ్రతుకు బండలయ్యే రోజు వస్తుందని. ఇదిగో వచ్చింది. ఇదే ఆరోజు. అమ్మా..! నాదో చిన్న కోరిక.. నా పాపని ఒకసారి చూసుకోనివ్వండి. ఆఖరిసారిగా చూసుకోనివ్వండి. చాలు. అంతకంటే మిమ్మల్ని యింకేమీ కోరను. నా పాపని చూపిస్తే చాలు, మీరు క్షమించినట్లు సంతృప్తి పడతాను.

ప్రేమారావు : వద్దు....! వాడికి చూపించొద్దు వాడి పాపిష్టి కళ్ళు ఆ పాపమీద పడానికి వీల్లేదు.

రాధ : చచ్చిన పాముని ఎంతకొట్టినా ఒకటే మాణిక్యం......! లే, దారికి అడు లే.

[లోపలికి వెళ్ళి పాపని తెచ్చి చూపించింది. కోలుకున్న పాపని చూచి కన్నీరు కార్చాడు సీతారాం.

పోలీసులు అతన్ని తీసుకు వెళ్తుండగా సోఫావెనక మూలుగు వినిపించింది.]

ప్రేమారా : [చూశాడు] ఎవరిది.....! తస్సారవలా..... బాబుగోరు.... కెప్టెను దొరగోరు...

శాంతమ్మ : ఆయన అక్కడేం చేస్తున్నారు?

సీతారాం : అదీ నేను చేసిన పనేనమ్మా... నేను చేసిన పాపాల్లో అదీ ఒకటి!

[రాజశేఖరం, ప్రేమారా, కె. నానారావుని బయటికి తీసుకొచ్చి సోఫాలో కూర్చోబెట్టారు.]

కె.నానారావు : కమాండర్.... కమాండర్.....

ప్రేమారావు : యస్సార్......!

కె.నానారావు : శత్రువులు వచ్చేస్తున్నారు. కావలా గట్టిగా వుంచు. గూఢచారులుంటారు. జాగ్రత్త.... ట్రూప్స్ సిద్ధం చెయ్...... ఆరర్స్ జారీ చెయ్....! ఇన్‌స్పెక్షన్‌కి వస్తున్నా ..... హాల్ట్ ట్రూప్స్ అటెన్షన్.

ప్రేమారావు : వద్దుసార్....! ఇప్పుడు శత్రువులందరూ దొరికిపోయారు. అదిగో పోలీసులు కూడా వచ్చారు. శత్రువుల్ని పట్టుకుపోతున్నారు.

కె.నానారావు : యూజింప్? ఇంక యుద్ధం లేదు కదూ....? అంతిమ విజయం మనదేకదూ.. ..?

ప్రేమారావు : యస్సార్.....

కె. నానారావు : అంతిమ విజయం మనదే... మనమే గెల్చాం.... ధర్మం గెలిచింది. న్యాయం నెగ్గింది. శత్రువులు వోడిపోయారు. దుర్మార్గం నశించింది. అంతిమ విజయం మనదే! జై జవాన్...! జై కిసాన్.....! కమాండర్.... కమాండర్..

ప్రేమారావు : యస్సార్.... [ఉత్సాహంగా హాల్ట్ ట్రూప్స్ కిస్‌మిస్.....

[సీతారాం పాపని వదల్లేక వదల్లేక వదుల్తాను. పోలీసులు అతన్ని తీసుకుపోతారు.]

—ఇదంతా నేపథ్యం వుండగా సైలెంట్‌గా జరుగుతుంది.

నేపథ్యం: [పాట]

నీ పుణ్యానికి ఇదిగో, రక్షా....
నీ పాపానికి అదిగో, శిక్షా.....!
దేవుడున్నాడని మరచిపోకు, ఆ—...
దివ్య దృష్టికీ దాగలేవురా—
నీతి న్యాయం నిలుచును ఎప్పుడూ...
సత్యం ధర్మం విలువ మరవకూ—
ఆశలు కోటలు దాటును పాపం...
చేసిన కర్మకు ఫలితం శాపం—
ఎంతతాగినా తీరదు దాహం.....
అంతులేనిదీ ధన వ్యామోహం—
మనిషి మనిషిలో మసిలే తృష్ణా...
మానవజాతికి విసిరే ప్రశ్నా—
ఇది ప్రశ్నా....! విధి ప్రశ్నా...!ఇదో సమస్యా..!!

—తెర—

(అయిపోయింది)



ముగిస్తూ, చిన్న మనవి :

నాటకాలు సమాజాన్ని ఉద్ధరించడం కోసమే అయితే— అలా రాసిన నాటకాలు చాలా వున్నాయి. ఇది మాత్రం అందుకుకాదు. కేవలం వినోదం కోసం. నేను కోరుకున్న వినోదం లభిస్తే ఈ నాటకం లక్ష్యం నెరవేరినట్లే!

ఈ నాటకం పూర్తిగా ప్రదర్శించడం కష్టం. కొన్ని రంగాలు తొలగించినా కథకి లోపం జరగదు.

నాటకం ప్రదర్శించదలచుకున్నవారు రచయితకి తప్పకుండా తెలియపర్చాలి.

ఈ నాటకం 'గ్రహణంలో దశమ గ్రహం' అనే పేరుతో 'ఆంధ్రప్రగతిశీల అభ్యుదయ కళా మండలి' సభ్యులు మొదటిసారిగా ప్రదర్శించారు. మరో ప్రదర్శనలో ఉత్తమ బహుమతులు కూడా వచ్చాయి.

—రచయిత.

# గాంధాభిమానులు - న్యూటన్ -


నిన్న మా హీరో గొప్ప అని అంటుంటే నాయా.. గాడికి మా హీరో గొప్ప అన్నేనా కొద్దిగా ఘర్షణ వచ్చింది.


వాడు పేదా, మట్టి మోసుకెళ్తున్నాడేమిటి
వాళ్ళ హీరో బొమ్మ మీద ఎవరో పేడ రుద్దారట.. అందుకని వీడు ఇదా..


మీ హీరోగారి సినిమా శతదినోత్సవం చేసుకోలేదని పొరబాటున రాసి ఉంటాడు లేరా.. కోపం తగ్గించుకోరా.. శాంతించరా.. ఒరేయ్..


గాంధీ పుట్టిన సంవత్సరం, నెల, ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా గుర్తు రావేంరా.. అన్నట్టు మన హీరో 1943-సంవత్సరం ఆగష్టు 24న మధ్యాహ్నం 12 కం 2 నిలకు జన్మించాడు----


ఎక్కడికిరా ప్రయాణం!
ప్రయాణం కాదురా.. మా హీరో సినిమా రేపే విడుదల.. టిక్కెట్టు దొరకకపోతే.. ఈ రాత్రి థియేటర్ దగ్గరే పడుకుంటామని--


ఏవి(టా) వాడలా చేతులు కాళ్ళు కష్టపడినట్టు.. బిగించుకు నడుస్తున్నాడూ పాపం జబ్బా!
కాదురా వాళ్ళ హీరో అలాగే నడుస్తాడట
Newton




**జి. కె. పి, విజయనగరం**

రామలక్ష్మిగారూ, విద్య లేనివాడు వింత పశువు అన్న పెద్దలే చదివిన వాడికన్న చాకలి నయం అని కూడా అన్నారు. మరి ఈ రెండింటికీ పొత్తు కుదిరేది ఎలాగ?

సందర్భానుసారంగా అన్న రెండూ ఒకేచోట చేరిస్తే ఇలాగే వింత అర్థానికి దారి తీస్తాయి........ చదువుకున్న మూర్ఖులు, చదువుకోని విజ్ఞులు ఉంటారన్నది మనం కాదనలేని సత్యం కదా.

**ఎస్. ఎ. ఆర్, జమ్‌షెడ్‌పూరు**

చాలా రోజులనుంచి మీ వారు గెడ్డం పెంచుకున్నారు. కొడుక్కోసం ఏమైనా మొక్కుకున్నారా ?

ఏమో మరి. నాతో ఆమాట ఎప్పుడూ చెప్పలేదు. ఈ మగాళ్ళకి అంత రహస్యం ఏమిటో మరి!

మీ ముగ్గురమ్మాయిల స్వయంవరం ఎప్పుడు ప్రకటిస్తారు ?

మీ ప్రవాసాంధ్ర బ్రహ్మచారి సంఘం ఏదైనా ఉందేమిటి? ఉంటే రదాలకి మెరుగులు దిద్దుకోవడం ప్రారంభించండి ఆగి మేఘాల మీద వచ్చి వాల్తారుగాని— అప్పుడే మొదటి బెల్లు కొట్టేశాం!

**సి. జె ఆర్, బరంపురం**

స్తంభంలో ఉందులేదని అన్నట్లు ప్రతి అణువులోనూ భగవంతుడు ఉన్నట్లయితే వేరే విగ్రహానికి ఎందుకు పూజ చేయాలి?

ఎవరు చెయ్యమన్నారు? మీకా ఏకాగ్రత ఉంటే కాకి గోల మధ్యనే కూచుని ధ్యాన నిమగ్నులు కావచ్చు.

**కళ్యాణశ్రీ, కొవెలకుంట్ల**

ముందుండే మనస్సు పెళ్ళి అయిన తర్వాత ఉండదెందుకండీ?

అదే గమ్మత్తు. కోరుకుంటున్నంత సేపూ పెళ్ళి తీయని బాధ. తీరా అయ్యాక తీరని సమస్య.

**పి ఎస్. ఎన్, విజయనగరం**

ఎవరైనా ఆడవాళ్ళ గూర్చి అంటే చాలు ప్రొటెస్టు చేసే మీరు ఆ అవతలి మనిషిని దుయ్యబట్టడంలో అంతర్యం ఏమిటి?

నేనెప్పుడూ అర్థం లేకుండా ప్రొటెస్టు చేయను. అన్యాయంగా ఎవరినేనా ఆడిపోస్తుంటే— వాళ్ళు ఆడవారా? మగవారా అనికూా లెక్కచెయ్యని వన్నే మీరిలా అంటున్నారే—అలాంటిది పురుష జాతిని, స్త్రీజాతిని తిట్టి పోయడమే ధ్యేయంగా పెట్టుకునే రచయితలనే మంటారో -వినాలని ఉంది.

**సావిత్రి, పలాస**

'బాపు' గారి కార్టూనుల పై మీ అభిప్రాయం ఏమిటి ?

బాపూ గీత పల్కుతుంది! ఆయన కాయనే సాటి—మన తెలుగునాట.

**పి. పి. కె, సికింద్రాబాదు**

మనిషిని మనిషిగా చూసే రోజులు వస్తాయంటారా ?

వస్తాయి. తప్పక. ఎప్పుడని మటుకు జోస్యం అడక్కండి.

**కె. ఎస్. ఆర్, చక్కం**

రావుడుగారూ, అని ఒక పాఠకుడు మిమ్మల్ని సంబోధించాడు. అది కూడా మరో పేరా మీకు?

అవును. బిరుదు నామం కాదు. అసలు పేరు— నన్ను చిన్నప్పటి నుంచీ తెలిసిన అందరూ, కొందరు, స్నేహితులూ అలాగే పిలుస్తారు. ఏం? చాలా ప్రిమిటివ్‌గా వుందా?

మీ పెంపుడు కొడుకు పేరేమి?

మావో ప్రసాద్!

**డి. పి, నేలపోగుల**

జీవితంలో ఎన్నో కలలు కుక్క గొడుగుల్లా మొలుస్తాయి. కాని అవి నెరవేరడం అనేది ఎందరికో సాధ్యంగాని పని.

అదే మంచిది— కుక్క గొడుగుల్లాంటి కలలన్నీ నెరవేరితే కష్టమే. అయినా తియ్యని కలలని కుక్క గొడుగులతో పోల్చేవేమిటి సోదరా? మీ ఊరిపేరు మహాత్యమా?!

**జి. ఆర్. జి. ఎస్, తిరుపతి**

చిన్నపిల్లల మనస్తత్వం వారి అభిరుచులు కనుగొనడం ఎలాగ?

వారిని పెంచడం ద్వారానే. అప్పుడు పుట్టిన పాప దగ్గిర నుంచి ఐదో ఏడొచ్చే దాకా ప్రతిపాపా ఒక వింతే అనిపిస్తుంది నాకు. వాళ్ళ, చేతులూ కాళ్ళు చూసి వాళ్ళు పడే వింత, నోరు, మెదిపి తొలిమాట అనడానికి పడే అవస్థ, తొలి అడుగు.. అన్నీ వారి ప్రాణానికొక అద్భుత ప్రయోగమే కాబోలు—వాళ్ళని చూస్తే అదే అనిపిస్తుంది. పసివాళ్ళని చూస్తుంటే ప్రపంచంలో యింకే పనీ చేయ బుద్ధి పుట్టదు.

**పి ఆర్. ఆర్, ఉంద్రాజవరం**

ఒక రచన ఆ రచయిత యొక్క తత్వాన్ని తెలియపరుస్తుందా ?

తెలియపరచి తీరాలని లేదు.

**కె. ఎమ్. ఖమ్మం**

తల్లితండ్రులకు తమ పిల్లలంతా సమానమేనా? లేక మగపిల్లలు, ఆడపిల్లలు అని తేడా ఉంటుందా ?

చిన్నప్పుడుండదు. కాని పెళ్ళి వయస్సు వచ్చాక ఆడపిల్లలు భారం. మగపిల్లలు లాభంగా తోస్తుందిట తల్లితండ్రులకి.

**పి. ఎస్. ఆర్, సూర్యాపేట**

ఆడవాళ్ళని వయస్సు అడిగితే చెప్పరు. ఎందువేత ?

ఎందుకు చెప్పాలి?.. ఏదైనా అడగవచ్చన్న దీమా మీకుంటే ఇష్టం లేకపోతే బదులు చెప్పక్కర లేదన్న నమ్మకం—మాకూ ఉంటుంది.

**జి వి. ఆర్, మద్రాసు**

ప్రశ్నావళి శీర్షిక చివరి పేజీనుండి ముందు పేజీలకి వచ్చింది. మీరు బహుశా వ్యక్తిగతంగా శ్రద్ధ తీసుకొని యిట్లా చేయించారా ?

చిత్రం లేదు. కొంచెం ముందు వెనుక తీస్తే ఒకచోటా ఆఖరు క్షణంలో యిస్తే ఒకచోటా వస్తూ వుంటాయి.. దీంట్లో పెద్ద ప్రత్యేకత ఉండదు. పత్రిక కార్యాలయంలో పనిచేస్తే యీ సంగతి సులభంగా గ్రహించేవారు..అయినా, వడ్డించేవాడు మనవాడైతే కడబంతిని కూర్చున్నా ఫరవా లేదన్న సామెత వినలేదా రమణగారూ? ప్రతి చిన్న విషయానికీ విపరీతార్థాలు ఊహించుకోవడంలో సబబు లేదు.

**ఎ. ఎస్. జి, బెజవాడ**

ప్రపంచంలో సువర్ణాక్షరాలతో లిఖించ దగినది లేదని అన్నాడు జార్జి బెర్నార్డ్ షా. అతనిపై మీ అభిప్రాయం.

నలభై దాటిన ప్రతివాడూ స్కౌండ్రల్ అనగల్గిన మేధావి! నిజం చెప్పాడంటాం. ఏమంటారు?

**ఎస్. ఏ. ఎల్, వెంకటగిరి**

21—8—70 పత్రికలో ఒక ప్రశ్నకు 'ఏ కాంప్లిమెంటు... నేర్పారు మదర్స్' అన్నారు. కాని చాడతగినదే గాని నేర్పినది వ్యక్తులా వ్యవస్థా? బహువచనం విపరీతార్థం తీసినది కదా?

బెంగపడకు సోదరీ, నేను ఇద్దరు తల్లుల ముద్దు బిడ్డను కాను! మదర్స్—అంటే కాన్వెంటులో ఉంటారే వారు!! ●




ఎన్నో జీవితాలకు తాను ప్రాణం పోశాడు. ఎన్నో జీవితాలలో చీకటిని పారద్రోలి వెలుగును ప్రసాదించాడు. 'అంధకారమయమైపోయిన తన జీవితానికింక వెలుగే లేదు. ఏ దేవుడూ ప్రసాదించలేడు. ఈ జీవితానికింక యింతే' గట్టిగా నిట్టూర్చాడు డా. మురారి.

_ చిన్నప్పటినుండి తనకు చీకటంటే భయం. చీకటింట్లోకి అడుగు పెట్టాలంటే పరమ చిరాకు. కళ్లలో వత్తులు వేసుకొని పెంచి పెద్ద చేసిన అమ్మ తామున్నంతవరకు ఆ అవసరమూ రానీయ

లేదు. కానీ ఇప్పుడో...కిటికీలన్నీ మూసి, తాళంవేసి ఉంచిన ఇంట్లోకి డ్యూటీ మీంచి వచ్చి, తాళం తీసుకొని పోవడమంటే ఆత్మహత్యా సదృశం. కానీ తప్పదు. విధి వ్రాత! అలవాటయిపోయింది చీకటి తనం. అంతులేని ఏకాంతం తన బ్రతుక్కు. ఏం చేస్తాం ?

'పురాకృత సుకృత విశేష బలం !' వెయ్యిన్నూట పదహారోసారి కాబోలు... అనుకొన్నాడు డా. మురారి.

వాకిలి తీసిన వెంటనే పోస్టుమేన్ వేసి పోయిన వో నీలిరంగు కవరు ఎదురయింది. ఉత్తరాలు చూడాలన్న ఉత్సుకత జీవన మాధుర్యంతోపాటూ ఏనాడో ఎండిపోయింది. ఎవరు వ్రాసుంటారు? 'నా' అన్నవాళ్ళు లేనపుడు ప్రపంచమంతా చుట్టాలే అట. సూక్తులు చెప్పడం తేలికే. కానీ అనుభవంలోకి వచ్చేటప్పటికి గొంతు పడ్తుంది. ఏ రోగుల బంధువులో, లేకుంటే నయం చేసుకొని పోయిన ఏ రోగో—తన హస్తవాసిని గురించి పొగుడుతూ, తనను చల్లగా చూసి నూరేండ్లు కాపాడమని భగవంతుని అర్థిస్తూ వ్రాసుంటాడు. 'మామూలేగా తనకు...' అనుకొంటూ ఉత్తరం చేతికి తీసుకొన్నాడు.

పరిచయమైన అక్షరాలు! జ్ఞాపకాల అడుగునుండి బయటకు తీయడాని కట్టే వ్యవధి పట్టలేదు. వాసంతినుండి ఉత్తరం! ఎన్నాళ్ళకు. ఆశ్చర్యంతోపాటు ఆవేదనా మిళితమై మంచంమీద కూలబడిపోయాడు మురారి.

'ఏనాటి వాసంతి ? యౌవనోషస్సులో తన జీవితంలోకి అడుగు పెట్టి, రెండేండ్లు ఏకఛత్రాధిపత్యంగా తన హృదయసామ్రాజ్యాన్ని పరిపాలించి, వాసంతే ప్రపంచంగా తన్నలరించి మరపించి, పెద్దల పెద్దతనానికి అమానుషంగా బలియై, తనకు దూరమయిపోయిన వాసంతి !

ఏ వాసంతి ఆలోచనలు తనను ఉక్కిరిబిక్కిరిచేసి తన జీవితాన్ని చీకటిమయం చేయడమే గాక తనను నమ్ముకొన్న మరో అమాయకురాలి జీవితం కూడా చీకటి చేసిందో...ఆ వాసంతి తిరిగి తన జీవితంలోకి ప్రవేశిస్తుందా ? ఎండి మోడు వాడిన తన జీవితానికి మరల వసంతమా? అదెలా సాధ్యం? తన జీవన మకరందం ఏనాడో ఎండి ఆవిరయిపోయింది. ఇంక మిగిలింది ఉట్టి జీవచ్ఛవం. మురారి నీడ —మురారి అన్న పేరుతో డాక్టరుగా పదిమందికీ పనికివచ్చేలా హాస్పిటల్‌లో బ్రతుకుతూ, ఇంట్లో సిగరెట్లు, త్రాగుడుతో ప్రపంచానికి దూరంగా బ్రతుకుతున్న మురారి! వాసంతి నిప్పుడేం చేసుకోగలడు?కవరు విప్పాడు, ఆలోచనలలా వదలి.

మురారీ,

ఆపత్సమయంలో ఆదుకొనేవాళ్లే కాదు ఆప్తమిత్రులంటే...గుర్తొచ్చేవాళ్లు కూడా ఆప్తమిత్రులే. ఈ మధ్య శ్యామల కలిసింది. నిన్ను గురించి చెప్పింది. 'అవసరం వచ్చినపుడు నా దగ్గరకు రావడానికి మొహమాట పడననీ, మన మధ్య స్నేహానికేం భంగం వాటిల్లదనీ' ఆనాడు మాటిచ్చావు గుర్తుందా? నీవు మాటకిచ్చే విలువ యింతేనా? మురారీ! ఘాటి మాటికీ ఇచ్చిన మాట తప్పి, భ్రష్టు పట్టిపోతున్నావు. శీలము వదిలేశావట. ఎందుకని? ఆమె చేసిన నేరమేమిటి ? ఎందుకలా అందర్ని హింసిస్తూ, నిన్ను నీవు నాశనం చేసుకొంటున్నావు ? ఈ నీ నిర్ణయం ఇరవై ఏండ్ల క్రిందట తీసుకోవాలిసింది, మురారీ! ఇప్పుడు కాదు. నిన్నే నమ్ముకొన్న ఆమె జీవితం ఎందుకు నాశనం చేశావు? ప్రేమించుకోవడం చాలా సహజమైన విషయం. ఆ ప్రేమ ఎన్నో రకాలు కావచ్చు. మానవుడు సంఘజీవి మురారీ! ఒకరిపై ఆధారపడకుండా, తనకు తానుగా ఐదునిమిషాలు జీవించలేడు. మరొకరికోసం జీవించడంలోనే మానవుని మనుగడకు సాఫల్యం ఉందేది. సృష్టి వైచిత్రమదే. పిల్లల్ని తల్లిదండ్రు లెంతగానో ప్రేమిస్తారు. స్వార్థరహితమైన ప్రేమ ఒక్క తల్లిదండ్రులలోనే చూస్తాము మనం. మరి పిల్లలుగా మనం చేసేదేమిటి ? రెక్కలొచ్చిం తరువాత ఎగిరిపోవడం. మరి, వాళ్లు కూడా నీలాగే జీవితాన్ని నాశనం చేసుకోవడం — ఆత్మహత్య చేసుకోవడం లాంటిది చేస్తే, మిగిలిన పిల్లల గతేమిటి?

పరిస్థితుల ప్రాబల్యం మానవుని వ్యక్తిత్వాలపై నీకు తెలియనిది కాదు. ప్రేమించావు. పెళ్లి చేసుకోవాలనీ అనుకొన్నావు. ఇందులో ద్రోహచింతన లేదే! పరిస్థితుల ప్రాబల్యం వలన మరొకామె నీ జీవితంలోకి అడుగు పెట్టింది. నిలదొక్కుకొని, పరిస్థితుల కనుగుణంగా నడచు కోవడంలో ఉంది గొప్పతనం మురారీ! ప్రేమించడం తప్పుకాదు. కానీ ఆ ప్రేమ విఫలమయిందని నానా దురలవాట్లకూ బానిసలవడం, మానవత్వం మరచిపోయి, దానవులుగా మారడంలో నిజమైన నైతిక పతనముంది. నీవింతగా, దిగజారి పోతావని అనుకోలేదు మురారీ! నైతిక పతనమంటే నాకు పరువు చిరాకని నీకు తెలుసుగా!...నిన్నా పరిస్థితిలో చూడవలసి రావడం నా దురదృష్టం. అందుకే నే నింకా బ్రతికిఉన్నా నేమోనని ఇప్పుడు దిగులుపడ్తున్నా.

నేను శుక్రవారం మధ్యాహ్నం మెయిలుకు అక్కడికొస్తున్నా, మీ కాలేజిలో జరగబోతున్న మెడికల్ కాన్ఫరెన్సు అటెండు అయ్యేందుకు. సోమవారంపోయం కాలం యింట్లోనే ఉండు.

ఇట్లు

వాసంతి.

'గతం నాస్తి' అన్నది పెద్దలసూక్తి, గతాన్ని మరచి, కొత్త భవిష్యత్తును మొదలుపెట్టడం తనకూ యిష్టమే. కానీ ఎలా ...? తన జీవితంపై చెదరని, మాయని, మధుర స్మృతుల మచ్చలు వేసిన గతం నాస్తి అని ఎలా అనుకోగలడు?

ఇలా జరగడానికి కారకు లెవరు ? విషమ పరిస్థితులు చుట్టుముట్టినపుడు ధైర్యం చెయ్యలేక తల వంచేసిన తనా ? తను మాతృత్వపు అధికారంతో, అభిమానంతో తన చుట్టూ వల పన్నిన తల్లిదండ్రులా ? కూతురి సుఖంకోసం, తన రక్తం ధారపోసి సంపాదించిన డబ్బుతో తన్ను కొనుక్కొన్న మామగారా? తనను, వాసంతిని ఒక్కటిగా చూడలేక కళ్లు కుట్టుకొన్న సహాధ్యాయులా ? ఏదీ కాక తన పూర్వజన్మ కర్మ అని సరిపెట్టు కోవడమా? ఏది కారణం!

* * *

అని తను పోస్టు గ్రాడ్యుయేషన్ కోసం మద్రాసుకు వెళ్లిన మొదటి రోజులు. మద్రాసు మెడికల్ కాలేజిలో ఆంధ్రులకు పోస్టు గ్రాడ్యుయేషన్‌కు సీటు దొరకడం దుర్లభం. నిజానికి తన కెంతో గర

## ఆహుతి

కారణమేది? కానీ తనది కాని భాష — తనది కాని ఊరు — ఒంటరి తనం — ఒక్కుమ్మడిగా తన్ను ఉక్కిరి బిక్కిరి చేశాయి. బ్రతుకు దుర్లభ మనిపించింది. అప్పుడే ప్రవేశించింది వాసంతి తన బ్రతుకులోకి. 'ఏమండీ! మీరు ఆంధ్రులటగా. నాకు చాలా ఆనందంగా ఉంది. ఇన్నాళ్లకొక తెలుగు మిత్రుడు దొరికినందుకు. మేమూ ఆంధ్రులమే. కానీ ప్రవాసాంధ్రులం. అది సరేగనీ, ఏ సబ్జెక్టుపై థీసిస్ సబ్మిట్ చెయ్యబోతున్నారు?' అంటూ తనన్తాను పరిచయం చేసుకొంది. వాసంతి ఎక్కడుంటే అక్కడ సెలయేటి గల గల, పక్షుల కిల కిలలూ ఉండేవి! ఆ పరిసరాలకూ, ఆ రోగులకూ, తనకూ మధ్య మీడియంగా తయారయింది వాసంతి. తన గైడు, లీడరూ సర్వం వాసంతే. వాసంతి లేకుంటే సినిమాకూడా చూడ బుద్ధయేది కాదు తనకు. వాసంతి పర్యవేక్షణక్రింద తనో చిన్న పిల్లాడయి పోయాడు. వాసంతి ఫైనలియర్‌కు రావడం, తాను రెండో సం. రం ఎమ్. డికి రావడం జరిగింది.

వేసంగి సెలవుల్లో ఆంధ్ర రాష్ట్రాన్ని — ఆంధ్రుల అందాల రాజధాని అయిన జంట నగరాలని చూపెట్టడం కోసం, ఊరికి తీసుకొచ్చేడు మురారి వాసంతిని. తల్లి దండ్రులకూ పరిచయం చేశాడు. 'వాసంతి నా గైడమ్మా! వాసంతే గనుక లేకుంటే నేను మద్రాసులో ఉండే వాణ్ణే కాదు! ఎమ్. డి. లేకుంటే పోయిందని ఏనాడో వచ్చేసి ఉండేవాణ్ణే...' అంటూ. అమ్మ ఎంతో సంతోషపడ్డది. ఎంతగానో చూసుకొంది వాసంతిని. 'కూతుండ్లు లేని నాకు నీవో కూతురమ్మా!' అంటూ మురిసిపోయింది కూడా.

పరీక్షలు దగ్గరవ్వే కొద్దీ — తాము మరింత చేరువకు రాసాగారు. తెలియంది చెప్పించు కోవడానికి రాత్రుల్లో కూడా రూముకొచ్చేది వాసంతి. మొదట తన కెలాగో ఉన్నా వద్దంటే ఎక్కడ నొచ్చుకొంటుందోనని మౌనం దాల్చాడు మురారి. అప్పుడే హాస్పిటల్లో గుసగుసలు ప్రారంభమయ్యాయి. మనకు కాపట్టని విషయాలెన్నో లోకానికి కావడుతుంది. అది తప్పులు పట్టం దెవరిని? కానీ అప్పుడు భయమేసింది. వాసంతి ఈ దుమారానికి భయపడి తనకెక్కడ దూరమవుతుందోనని.

అప్పటికి కానీ మురారికి తెలిసిరాలేదు. మురారి జీవనలత వాసంతి అనే మొక్క చుట్టు అల్లుక పోబడిందనీ, ఆ ఆలంబనం లేకుంటే మురారి జీవితమూ లేదన్న విషయం. అలా గుర్తించడాని కెంతో భయపడ్డాడు.

ఆ సాయంకాలం మెరీనాబీచ్‌లో కూర్చున్నారు. ఏదో బాధ. వ్యాకులత. తనది కాని ఆవేదన. మౌనంగా కూర్చున్న మురారిని చూసి ఆశ్చర్యపోయింది వాసంతి. 'ఏం మురారీ! ఒంట్లో బాగా లేదా? ఇంట్లో నుండి ఏమయినా ఉత్తరం వచ్చిందా? అలా ఉన్నావెందుకని...'

'అబ్బే. అదేం లేదు వాసంతీ! నిన్నో ప్రశ్న అడగాలని ఎన్నో రోజుల్నుండి అనుకొంటున్నా. నీవేమనుకొంటావో నన్న భయం అడగనియ్యటం లేదు. సమాధానం ఎటువంటిదైనా ఫరవాలేదు. కానీ నాకు సూటిగా జవాబు కావాలి. వాసంతీ! నన్ను గురించి నీ అభిప్రాయమేమిటి?'

వాసంతి ముందు తెల్లబోయింది. అటు తరువాత తెప్పరిల్లుకొని కిలకిలా నవ్వేస్తూ 'ఇందుకేనా? ఇంత గాంభీర్యం? ఇంత మౌనం. ఎన్నాళ్ళ రిహార్సల్సు చేశావేమిటి?' అంది తన సహజమైన హాస్య ధోరణిలో.

'వాసంతీ! నాకు సమాధానం కావాలి. ఇది నవ్వులాటలకు కాదు. నవ్వులాట కిది సమయం కాదు.'

'మురారీ! తన కుడి చేతిని గురించి, తను పీల్చుకొనే గాలిని గురించి ఎవరైనా అభిప్రాయాలు ఏర్పరచుకొంటారా? అలాగే నిన్ను గురించి ఇంతవరకు నేను ప్రత్యేకంగా ఆలోచించలేదు.'

అంతే. ఆ తరువాత జనరల్ హాస్పిటల్ నందనంగానూ, మెరీనా బీచ్ బృందావనంగానూ మారడాని కాట్టేకాలం పట్టలేదు. ఆనందంలో రోజులు గడిచినంత త్వరలో దుఃఖంలో రోజులు గడవవు. కష్టాల పరంపర నెత్తిమీది కొచ్చినప్పుడు రోజులెంత బరువుగా—దీర్ఘంగా గడుస్తాయని?

'మురారీ! మానవులందరూ, ఎందుకు పుడుతున్నారో...ఎందుకు గిడుతున్నారో... తెలియదు...తెలుసుకోవాలని కూడా లేదు. కానీ నేను పుట్టింది మాత్రం నీకోసమే' నంటూ ఆత్మార్పణ చేసుకొన్న వాసంతి ప్రతిఫలం వాంఛారహితంగా ప్రేమించ గల్గడం ఒక్క వాసంతికే చెల్లింది. అలాంటి వాసంతికి తాను చేసిందేమిటి? తనకు జరిగిందేమిటి?

ఈ విషయం తన 'హితైషులు' అనుకునే స్నేహితులు—తానేదో పాడయిపోతు



న్నాడన్న భ్రమమీద—ఇంటికి ఉత్తరం వ్రాశారు. ఫలితం —

'మదర్ సీరియస్. స్టార్ట్ ఇమ్మీడియట్లీ' అన్న టెలిగ్రాం అందుకొని ఊరికి వెళితే, బాజాభజంత్రీలతో, బంధుమిత్రులతో మంగళకరంగా వున్న ఇల్లు యెదురయింది. గుండె దడదడ లాడింది. అందులోని ఆంతర్యం పసిగట్టాడు.

వాళ్ళమ్మ దగ్గరకు వెళ్ళాడు. 'ఈ పెళ్ళి చచ్చినా నే చేసుకోను. నా యిష్టాయిష్టాలతో పనిలేక నా పెళ్ళి చేసే అధికారం మీ కెవరిచ్చారే...'

'మురారీ! మనమున్నది పవిత్రమైన భారతదేశంలో. 'మాతృదేవోభవ పితృదేవోభవ...' అన్నది మన మూలసూత్రం. దాన్ని మించిన వంశాచారాలూ, ఇంటిగౌరవాలూ... యెన్నో పిల్లలకి తెలియవి. కని, పెంచి, పెద్ద చేసే తల్లిదండ్రులకామాత్రం అధికారం లేదంటావా? ఆ అధికారం వేరే ఎవరైనా యివ్వాలంటావా? మీ నాన్న నన్నెలా చేసుకొన్నారనుకొన్నావు? మీ తాతగారి మాట వినే. వాళ్ళ నాన్న అంతే. మన ఆచారం అంతే నాయనా!'

'అది కాదమ్మా! పిల్లల బాగోగులు చూస్తూ పెంచి పెద్దచేసే తల్లిదండ్రులు పిల్లల ఆంతర్యం గ్రహించలేకపోతే ఎలాగ? చిన్నప్పుడు బజార్లో వో బొమ్మనుచూసి కావాలని ఏడ్చి పట్టుబడితే, మరపించడానికి తాయిలం పెట్టేదానివి. కాదు కూడదంటే వెంకన్నను పంపి తెమ్మనే దానివి. మరచిపోయావా? ఆ మనస్తత్వమే ఇప్పుడు మరి కొంచెం గట్టిపడి వుంటుందనీ, కావాలనుకొన్నదీ, మనసు కోరిందీ సంపాదించుకోవాలన్న దృఢత్వమూ ఏర్పడి ఉంటుందనీ ఎందు కనుకోవు?'

'నీవు కోరే కోరిక న్యాయమయిందైతే చెప్పు నాయనా! మేము కోరేది నీ సుఖమూ, నీ వలన వృద్ధి అయ్యే మన వంశాచారమే గదా!'

'అయితే, నేను వాసంతిని తప్ప మరొకర్ని చేపట్టలేనమ్మా! కన్నెత్తి కూడా మరొకర్ని చూసే సాహసం చెయ్యలేను. వాసంతి నా జీవిత భాగస్వామిని కానినాడు, మురారికి జీవితమే లేదు. వాసంతి కేం తక్కువయిందని, నన్ను కాదని ఈ పెళ్ళి

# ఎలుకలూ-మద్యపానోన్మత్తులూ

మద్యపానం అతిగా అవటంవల్ల శరీరానికీ, మనస్సుకీ కలిగే బాధలని గురించి అందరికీ తెలుసు. వాటి కారణాలని గురించి అంతగా తెలియదు. కొంతకాలంగా పరిశోధన జరుగుతోంది. కొన్ని పరిశోధనల ఫలితాలు ...

కొందరు బాగా తాగుతారు, మరి కొందరు బాగా తాగి మద్యపానోన్మత్తులవుతారు. ఈ రెండు రకాల వారి మధ్య తేడా స్పష్టంగా కనిపించకపోయినా అది ఉండటం మాత్రం ఉందని అనాలి.

మద్యపానం కేవలం దుర్వ్యసనం అనుకునే వారిసంఖ్య అధికం. ఇది సరయిన ఊహ కాదు, మద్యపానోన్మత్తులని గురించి తగినంత పరిశోధన జరిపి వారి కష్టాలని ఎలాగ తీర్చాలో తెలుసుకొనటం అవసరం అనుకుని కృషిచేస్తూ వచ్చిన వైద్యులు కొందరు తమ పరిశోధన ఫలితాలని ప్రచురిస్తూ వచ్చారు. ఈ పరిశోధనల ఖర్చులని భరించిన సంస్థలలో మద్యపానీయాలని తయారు చేసే సంస్థలు కూడా ఉన్నాయి!

మద్యపానోన్మత్తులకి తాగటం ఆపితే మూర్ఛలు, భ్రాంతులు మొదలయినవి వస్తాయి. ఇవి ఎందుకు వస్తాయి?

పరిశోధకులలో అగ్రగణ్యుడయిన డా. బ్రూస్ రిట్సన్ అనే ఆయన ఎలుకలమీద కొన్ని ప్రయోగాలు చేశాడు. కొన్ని ఎలుకలకి సారాయం అలవాటుచేసి వాటి మెదళ్ళని అనుశీలించి చూశాడు.

ఆరువారాలు సారాయం సేవించిన ఎలుకల మెదళ్లలో 'సెరోటోనిన్' అనే పదార్థం బాగా అధికంగా ఉండటం డా. రిట్సన్ గమనించాడు. ఇటువంటి ఎలుకలకి సారాయం ఆపితే అవికూడా బాధపడేవిట.

మరికొన్ని ఎలుకల మెదళ్లలో సెరోటోనిన్ అధికం కాకముందే సారాయం ఆపివేస్తే అవి అంత బాధ పడలేదుట.

సెరోటోనిన్ మోతాదుని బట్టి మానసిక స్థితి మారుతూ ఉంటుందన్న సంగతి కొంతకాలంగా తెలిసిందే. అయితే తాగుడికీ దీనికీ సంబంధం ఏమిటి? డా. రిట్సన్ ప్రయోగాలని పరిశీలిస్తే ఒక సమాధానం తోస్తుంది. బాగా తాగేవారి మెదడు తనలో సహజంగా ఉండే సెరోటోనిన్‌ని సాధారణ పద్ధతిలో వదిలించుకునే సామర్థ్యాన్ని కోల్పోతుంది. కొత్త పద్ధతి నొకదానిని అవలంబిస్తుంది. ఇదేమిటంటే, అదనంగా ఉండే సెరోటోనిన్‌ని 'హైడ్రాక్సీ ట్రిప్టోఫాల్'గా మారుస్తుంది. ఈ పదార్థం ఉన్మాదం లక్షణాలు కనిపించేటట్లు చేస్తుంది...

ఈ పరిశోధనలవల్ల తెలిసిన విషయాలని బట్టి మరికొంత ప్రగాఢ పరిశోధన జరిపి మందులు కని పెట్టటం అవసరం. మద్యపాన వ్యసనాన్ని రోగంగా అర్థంచేసుకుని చికిత్స చెయ్యాలి ...

—జాన్‌కోట్లు (ఫో. వ. ఫీ.)

శ్రయింవారమ్మా!"

'హెచ్చు తగ్గుల ప్రసక్తే లేదిందులో నాయనా! శీలం తక్కువయిందని శీలను వద్దంటున్నావు మువ్వు? కావలసింది — అంతస్తు, ఇంటిపేరు, ఆచారాలు, కుల గోత్రాలు. పిల్లకూడా చక్కనిదే. వాసంతి కూడా చక్కగానే వుంది. పైగా నీ అంత చదువుకొంది. వినయ గుణవంతురాలు. పైగా మన శాఖ కాదు. మన భాష కాదు. కయ్యానికి, వియ్యానికి సమానత్వం వుండాలంటారు పెద్దలు. నీవూ కాదనలేవుగదా ఆ మాటను.'

'అంతస్తుల మెట్లపై నిలబడి నేను శీలకు అన్యాయం చెయ్యలేనమ్మా! నీవే మైనా అను.'

అంతలో నాన్నగారి రంగ ప్రవేశం. 'చూడు మురారీ! నీవు నా మాటను కాదనగలవని, అంతవాడి వయ్యావని, అవుతావని నాకు తెలియదు. అందుకనే, రంగనాథంగారు తన కూతుర్ని నీ కివ్వాలని, వాసంతి నీకు తెలియక ముందునుండీ అంటుంటే ఇప్పుడు మాటిచ్చాము. పిల్ల చక్కగా ఉంది. అంతో యింతో చదువుకొంది. మన యింటి ఆచారాలను అర్థం చేసుకోగలదు. అంతకంటే కావలసిం దేముంది? నీవు మా మాటను కాదని—ఓ అనామకురాలిని చేసుకొంటు న్నావన్న అపప్రథ మాకు కల్గించా లను కొంటే – ఇదో ఈ కత్తితో మీ అమ్మనూ నన్నూ పొడిచేసి నీవు వెళ్ళొచ్చు'

'వాసంతి అనామకురాలెలా అవుతుంది? ఈనాడు డాక్టరు వాసంతి! రేపు ఫలానా జడ్జి కోడలు వాసంతి! మీరు కోరిన కట్నం యివ్వలేక పోవచ్చు. అంతే!'

'ఇచ్చిన మాటను నిలబెట్టు నాయనా' అమ్మ ఏడుపు.

వాళ్ళ చేతుల్లో యజ్ఞ పశువయి పోయాడు తను. తన జీవిత కుసుమాన్ని వాళ్ళ పెద్దరికమనే కబంధ హస్తాలతో నలిపి పారవేశారు.

ఫలితం—లక్ష యాభై వేల రూపాయలతో భార్య అనే స్థానాన్ని కొనుక్కోగల్గింది. కానీ వాసంతి పరమైన మనసు శీలను పరిగ్రహించడానికి సిద్ధపడక పోయింది. రెండు జీవితాలు జీవించడం తనకూ చేతకాకపోయింది.

మద్రాసు రావడానికేదో భయం. బెరుకు తనం. అయినా తప్పనిసరి. తప్పలేదు. పెళ్ళయిన విషయం అందరికీ తెలిసి పోయింది. 'అంధులను నమ్మకూడదు' అన్నారట తన కొలీగ్ శ్రీనివాసన్ వాసంతితో.

'నన్ను చూసిందే గుండెలు వ్రక్కలయ్యేలా ఏడ్చే వాసంతి నేమని ఓదార్చను? తెలియక. మాటలు రాక కన్నీరు కార్చడమే నా వంతూ అయింది. అప్పటి వాసంతి కంటి కాటుక అంటిన తెల్లని టెర్లిన్ షర్టు ఇప్పటికీ ఉంది బీరువాలో పదిలంగా. అదే నాకు మిగిలిన పెన్నిధి. జీవితంలో యింకేం మిగుల్చుకోలేక పోయాను.'

తనే తెప్పరిల్లుకొని, మామూలుగా నవ్వేస్తూ, 'ఎలా ఉంది మీ ఆవిడ? అందగత్తేనా? ఎంతవరకు చదువుకొంది...' ఎన్నో ఏళ్ళ ఎత్తుకు పెరిగినట్లని పించింది.

'మౌనం నా వంతయింది. 'ఎవరితోనూ మాట్లాడవద్దందా? మీ ఆవిడ.' అంది నవ్వుతో... ఆ నవ్వులో జీవం లేదు. మొహం నలభై ఏండ్ల ముసలితనాన్ని పులుముకొన్నట్లగుపిస్తోంది.

'వాసంతీ! నన్ను తిట్టు. నీ కన్నీళ్ళతో శపించు. అంతేగానీ క్షమించకు. క్షమించి వివశవధ చెయ్యకు.' అంటూ బావురుమన్న తనకు, 'మురారీ! మనం మానవులమన్న విషయం మరచిపోతే ఎలాగ? మానవుడు విధి చేతిలో కీలుబొమ్మ. దానొకటి తలిస్తే దేవుడొకటి తలుచునన్న విషయం నీకు మాత్రం తెలియదా? మనం అను కొనేవన్నీ జరుగుతూపోతే మనకి దేవుడికీ తేడా వుండొద్దూ? నీకు నేనేమీ కాక పోయినా, మన మధ్య స్నేహం మాత్రం ఉంచు మురారీ! అది మాత్రం దూరం చెయ్యకు' అంటూ తన జీవితంనుండి నిష్క్రమించింది.

ఎంత చెప్పినా వినకుండా, చదువుకు న్యాయం చేకూర్చలేనంటూ పరీక్షలకు వెళ్ళకుండా, ఆ ఊరినుండీ నిష్క్రమించింది. దీనికి ఎవరు బాధ్యులు ఏం చెయ్యలేని పరిస్థితి. చేతులకు శృంఖలాలు పడ్డాయి. లోపల్లోపల కుమలటం తప్ప మాటలాడే సమయమూ కాదు. ఎమ్. ఢి. పాసయి వచ్చేస్తూ వాసంతి ఊరికి ఉత్తరం వ్రాశాడు.

వాసంతీ!

జీవితం జీవించడానికే నన్న విషయం నీకు తెలిసిందే గదా? పైగా మనం బ్రతికేది మనకోసం కాదనీ, మరొకరికోసమేనని నీవూ చెపుతుంటావు గదా! నీ జీవితంలో జరగకూడని అన్యాయమే జరిగిపోయింది. అది నా మూలంగా జరిగింది కాబట్టి



## ప్రొద్దుటి తాజాతనము గంటలు తరబడి రోజంతా




ఔను, స్నానం అయిన తరువాత ప్రొద్దుటి
పూలవుండే తాజాతనము రోజంతా
గంటల కొద్దీ వుంచుకోవచ్చు....పాండ్స్
డ్రీమ్ ఫ్లవర్ టాల్క్‌తో భారతదేశంలో
విస్తారంగా అమ్ముడయే టాల్క్
పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్‌కు నాజూకైన
పరిమళము అల్లా వస్తూనే వుంటుంది....
పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్ తడిని
వెంటనే పీల్చుకుంటుంది,
అతిసన్నిహితంగా చేరాలనిపిస్తుంది....
చల్లగా, తాజాగా, పరిమళిస్తూ
వుంటుంది. ఉక్కతో ఒళ్లంత
అంటుకుంటూండే ఉష్ణ
ప్రదేశాల్లో కూడా. ఇది సంవత్సరం
పొడుగునా అన్నికాలాలలోను
ఉపయోగించగల టాల్క్!
3 సైజులలో లభిస్తుంది
ఫ్యామిలీ-లార్జి-మీడియమ్

## పాండ్స్
## డ్రీమ్ ఫ్లవర్ టాల్క్

అతి మృదువుగా ఆహ్లాదకరమైన టాల్క్
చీస్ బ్రో.-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు. యస్. ఎ. లో స్థాపితము.)

P-5402

నిన్ను క్షమించమని కూడా అడగాలనుకో? కానీ ఒక్క స్నేహితుడుగా, నీ మేలు, నీ మంచికోరే హితైషిగా ఒక్కటి చెప్తున్నాను. నా మాట మన్నించగలవన్న విశ్వాసం నాకింకా ఉంది. వాసంతీ! నా మాట తమ్మ్మ చెయ్యవు గదా! జరిగింది ఓ పీడకలగా మరచిపో. బ్రతుకును ఆనందమయం చేసుకో. మీ తల్లిదండ్రుల ఆనందం కోసమయినా నీవు వివాహం చేసుకోక తప్పదు వాసంతీ! 'గాలి వీచి పూవుల తీగ నేల రాలిపోతే చేరదీసి నీరు పోసి చిగురించనీయ'మన్నాడో ఆధునిక కవి కాదా? నన్ను మరచిపో. మరొకర్ని చేపట్టి, జీవితంలో ఎనలేని సౌఖ్యాన్ని,

## ఆహుతి

ఆనందాన్ని పొందాలని కోరుకుంటున్న — మురారి.

దీనికి జవాబు వస్తుందని ఆశించలేను. రావాలని మాత్రం కోరుకున్నాడంతే. చాలా కాలానికి వాసంతి రిప్లై వ్రాసింది. నెత్తిన మరో పిడుగు పడినట్లనిపించింది.

"మురారీ!

పసుపుతాడు కట్టుకొన్నంత మాత్రాన మనిషిమీద అధికారం ప్రసాదించవచ్చునేమో గానీ, మనసు మీద అధికారం సంపాదించ గలమా? పెంచుకొన్న ఆశలు, మమతలు పసుపుతాడు వేయనంత మాత్రాన మడిచి పెట్టుకొని పోగలవా? మురారీ! నాకు మానవత్వం మీద, మనుష్యులకూ, మనుష్యులకూ మధ్య ఉండే మమతలమీద నమ్మకం కానీ మన వివాహ వ్యవస్థ మీద నమ్మకం లేదు మురారీ! 'సిగరెట్లు కాల్చకండీ!' అనే భార్య నెత్తిన చెయ్యి పెట్టి, 'సరే కాల్చనే, నీ ఒట్టు.' అని చెప్పి అవతలికెళ్ళి సిగరెట్లు కాల్చే మగవాళ్ళెంత మంది లేరు? ఆ భార్యకున్న విలువేమిటి చెప్పండు? మురారీ! భార్య అన్న స్థానం తప్ప.

నేను మరొకరి భార్యనయి, ఆత్మవంచన చేసుకొంటూ, అనుక్షణం నన్ను నేను చంపుకొంటూ రెండు బ్రతుకులు బ్రతకలేను మురారీ! దయచేసి నన్నా కోరిక కోరకు. నా జీవితంలో వెలుగురేఖ మాయమయి పోయింది. మురారిలేని జీవితం జీవితమే కాదు. ప్రాక్టికల్‌గా వాసంతి చచ్చిపోయింది. అయినా కనిపెంచి పెద్దజేసిన తల్లిదండ్రులకు మనం కాస్త కృతజ్ఞత చూపద్దూ? అందుకోసమైనా బ్రతకాలి. నాకన్యాయం చేశానని బాధపడకు. ఎలా జరగాలనివుంటే అలా జరుగుతుంది. ఏం చెప్పను?

నీ క్షేమమే నా కోరిక!

ఇట్లు
వాసంతి.

హైదరాబాద్ కొచ్చిందరువాత గానీ, మద్రాసులో నేను పోగొట్టుకొన్న దేమిటో ...తెలియలేదు. బ్రతుకు బరువుగా, నిస్సారంగా, దుర్భరంగా కన్పిస్తోంది. అవ్యక్తమైన ఆవేదన దహించివేస్తోంది. లీల! లీలను చూడటానికే భయమేస్తోంది! భార్యగా ఊహించుకోలేక పోతున్నాడు. ఆ స్థానం ఒక్క వాసంతికే అంకితం. మరిప్పుడు లీలనేం చెయ్యాలి? ఆలోచనలు పిచ్చెక్కిస్తున్నాయి, త్రాగుడు కలవాటు పడక తప్పలేదు. లీలను ఎంత ప్రయత్నించినా చేతికి తీసుకోలేక పోయాడు. లీలకన్యాయం జరుగుతోందని కూడా తెలుసు. తన విషయంలో అశక్తుడు. ఏం చెయ్యలేడు.

'లీలా! నీకన్యాయం జరుగుతోంది. నన్ను క్షమించి, నీవు వేరే ఎవరినైనా పెళ్ళిచేసుకో లీలా! నా వలన నీకేం సుఖమూ ఉండదు. నాకు వివాహంపై



వాంఛ లేదు లీలా! అమ్మ నాన్నలు విన లేదు. నీ మెడకు ఉరిత్రాడు బిగించారు.'

'మీకు లేని వాంఛ నాకు మాత్రం ఉన్నదని కాదు. భార్యగా కాకపోయినా, ఓ స్నేహితురాలుగా చెప్పండి. మీరెందుకలా ఉంటారు? ఏదో పోగొట్టు కొన్నట్లు మీలో మీరే మథనపడడ మెందుకు? మీ సుఖంలో వద్దు. మీ బాధలోనైనా భాగం పంచుకోనివ్వరా? నన్ను.' కన్నీళ్లతో లీల ప్రాధేయ పడుతూంటే—వేటగాని బాణం గురి తప్పకుండా వచ్చి తగిలిన పక్షిలా అయ్యాడు తను.

'లీలా! నేను మద్రాసు మెడికల్ కాలేజీలో ఉండగా వాసంతి అన్న ఓ మెడికల్ స్టూడెంటుండేది. చాలా అమాయకురాలు మూర్తీభవించిన మంచితనం ఆమె. మే మిద్దరం ప్రేమించుకొన్నాము. లీలా! వాసంతి లేని బ్రతుకు నేనప్పట్లో ఊహించేవాడ్నే కాదు. కాని విధి లిఖితం. ఆమె స్థానం నీ వాక్రమించావు. కానీ ఆమె పరమైన మనసుమాత్రం నీవైపుకు మళ్ళించలేక పోతున్నా, ఎంత ప్రయత్నించినా. మనసు, మమతలు లేని యాంత్రిక బంధం నా కసహ్యం లీలా! అందుకే నీవు మరొకర్ని వివాహంచేసుకో నేను చేయిస్తాను పెళ్ళి...'

'అదృష్టవంతురాలు. ఆవిడలో అంతగా మిమ్మల్ని ఆకర్షించిం దేమిటో...'

'ఆకర్షణలకు లొంగిపోయా ననుకోకు లీలా! ఆమె చాలా సామాన్యమైన యువతి. నీ కంటే దేనిలోనూ ఆమె గొప్పకాదు. నన్నంతగా బంధించి ఉంచిందేమిటో నాకూ అర్థం కాదు. అదేదో... అంటారే పూర్వజన్మానుబంధమని. అలాంటిదే కావచ్చు.' ఎటో చూస్తూ సమాధాన మిచ్చాడు.

'ఆవిడను మీ రిప్పుడు తెచ్చుకోండి. మీ సుఖానికి నే నడ్డురాను.' లీలకంటిలో నీళ్ళు విచలుణ్ని చేసి పారేయగా,

'లీలా!' అంటూ హా గా వు కే క పెట్టాడు.

కొత్త కొత్త ఆలోచనలు రాసాగాయి. బ్రతుకు మరీ దుర్భర మనిపించినపుడు — పున్నమి వెన్నెల్లో, మల్లెల పరిమళాల మత్తులో, వాసంతిని లేవదీసుకొని

ఎక్కడికయినా పారిపోదా మనిపించేది. కానీ ఈ సొసైటి, హోదా—ఇవి చాలు. జీవితాన్ని నరకం చెయ్యడానికి.

అప్పుడే వచ్చింది వాసంతి. ఢిల్లీకేదో ఇంటర్వ్యూకోసం వెడుతూ, మా సంసారాన్ని చూడ్డంకోసం ఒకరోజు ఆగింది.

మున్దున్న లావణ్యం లేదు. కళ్ళల్లో ఆ చురుకు లేదు. మనిషి ఏ పదిఏండ్లు ఎదిగినట్లు కన్పించింది.

భోజనాలనంతరం మేడమీది గదిలో కూర్చొని న్యూస్‌పేపరు చదువుతున్న నా దగ్గరకు సరాసరి వచ్చి, కుర్చీని దగ్గరగా లాక్కొని కూర్చుంది.

'మురారీ! త్యాగమంటే ఏమిటి ?'

'డొంక తిరుగుళ్ళు మాని, అడగ దలచుకొన్న దేమిటో మాటిగా అడుగు.'

'లీల ఏం చేసిందని ఆవిడకీ శిక్ష ? నీవు చేసిన పనికిమాలిన పనికి, ఆవిడెలా బాధ్యురాలు? ఆనాడే, ఈ నిర్ణయం తీసుకొని ఉండవలసింది మురారీ! మీనాన్నకు చెప్పి ఉండాల్సింది. వాసంతికి తప్ప నీ హృదయంలో మరెవ్వరికి స్థానం లేదనీ, ఇవ్వలేననీ. 'లేదా సరాసరి మద్రాసు వచ్చేసి ఉండాల్సింది. అప్పుడేమో వాళ్ళతోబాటు నీకూ, హోదా,

# ఆహుతి

అంతస్థూ, డబ్బూ, ఇల్లూ కావలసి వచ్చేయి' ఇప్పుడేమో, నీ అశక్తతను, చేతగానితనాన్ని ఆ అమాయకురాలిపై చూపిస్తున్నావు. నీ జీవితాన్ని నాశనం చేసుకోవడమే కాకుండా, తన జీవితాన్నీ నాశనం చేస్తున్నావు. ఈ హింసాకాండకు అంతమెక్కడ మురారీ?'

'వాసంతీ! మనుష్యులందరూ కాకపోయినా, కొంతమందయినా ఒక్కలాగే ఉంటారనీ, నేనూ నీలాంటి మనిషినే అనీ, నాకున్నది హృదయమేననీ ఎందుకనుకోవు? నీవెందుకలా ఉండిపోయావు? ఆ పాపం మాత్రం నాది కాదా? నీ ఉసురు మాత్రం తగలదేమిటి? నీ పెళ్ళి చూడాలని కలవరించి, కలలు కని ఏడ్చి దూరమయిపోయిన మీ తల్లిదండ్రుల ఉసురు మాత్రం తగలదేమిటి? నీవు మాత్రం ఎందుకు పెళ్ళి చేసుకోలేదు. నాకిచ్చిన మనసు మరొకరి కివ్వలేక. అంతేనా? నాకూ అలాగే ఉండదా? పరిస్థితుల ప్రాబల్యం ఆమె మెడలో తాళికట్టేలా చేసింది ఆ పాపం నన్ను చుట్టుముట్టినా ముట్టనీ! కానీ నేను అశక్తుణ్ణి. బలవంతంగానైనా ఆమె జీవితంలోకి ప్రవేశించలేను...'

'అది ముందే ఆలోచించుకొని ఉండవలసింది మురారీ.'

'నేను కాదు. వాళ్ళ తల్లిదండ్రులాలోచించుకొని ఉండాలి. ఇప్పుడు నీకొకావలసింది నా సుఖమా? లీల సుఖమా?'

'ఇద్దరిదీను. నాలోని మానవత్వం లీల సుఖం కోరుతూందంటే, మమత నీ బాగు కోరుతోంది మురారీ!'

'అదే నిజమయితే, నాతోపాటు వచ్చేయి. మనం ఎక్కడైనా వెళ్ళి హాయిగా ఉందాము...'

'మురారీ!' పిలుపు కాదది. గర్జన. 'ఎంత నైచ్యానికి పాల్పడుతున్నావు. స్వార్థంతో నీ కళ్ళు మూసుకుపోతున్నాయి. ఇప్పుడేం మాట్లాడి నీతో లాభంలేదు. ఛీ...ఛీ...'

'ఏం? ఈ అగ్గిరీలుండవని భయమా? కారుండదు. సొసైటీలో గొప్ప పేరుండదు...'

'నే బ్రతికి ఉంటేనేగదూ! నీ బుద్ధి ఇలా పెడదారులుపడుతోంది. ఇంక నీ వాసంతి నీకే కాదు ప్రపంచానికే శాశ్వతంగా దూరమయిపోతుంది.' కన్నీళ్ళతో గబ గబ మెట్లుదిగి అదృశ్యమైపోయిన వాసంతి!

మళ్ళీ ఇన్నాళ్ళకు దర్శనమివ్వబోతోంది!

తన జీవితంనుండి లీల నిష్క్రమించింది. బలవంతంగా తన జీవితంలోకి ఎలా ప్రవేశపెట్టారో...వాళ్ళ తల్లిదండ్రులు అంత బలవంతంగానూ లాక్కుపోయారు. యాభై వేలకు మరో ఇరవై వేలు వేసి ఇచ్చేశాను. 'పాప పరిష్కారం చేసుకోవాలనుకొంటున్నావా దీంతో ?' మామగారి అవహేళన. 'కాదు. తోబుట్టువు కిచ్చే లాంఛనం లాంటిది.'

తమ పెద్దరికం కొడుకు బ్రతుకు నిలా నాశనం చేస్తుందని ఎదురు చూడని అమ్మ నాన్నలు, వాళ్ళ ఆశలు దెబ్బతినిపోగా, వరుసగా మూడు జీవితాలు నాశనం చేశామన్న దిగులుతోనే 'మురారీ! ఆ వాసంతినే చేసుకో నాయనా! మా కళ్ళ ముందు, నీవిలా వుండేకన్నా మమ్మల్ని ఒక్కసారిగా చంపెయ్యరా...' అంటూనే



కన్ను మూశారు.

* * *

ఒంటరితనం ... భరించరాని ఒంటరి తనం. ఒంటరితనాన్ని అనుభవించడంకన్న పెద్ద శిక్ష లేదు మానవుడికి అనిపిస్తుంది. లీల ఉన్నా హాయిగా ఉండేది—ఇంట్లో వో అడదిక్కుండేది. వాసంతి రాక ముందే ఈ సోడా బాటిల్స్, ఇవి తీసి దాచె య్యాలి. లేకుంటే మరల సంజాయిషీ, ఏడుపు. బ్రతిమిలాడడాలు...విసుగొస్తోంది.

కాలింగ్ బెల్ చప్పుడయితే ఏ పేషెంటో ననుకొని వాకిలి తీసిన మురారికి వాసంతే ఎదురయింది. ఆశ్చర్యం కాదు. భయం, కంగారు ముంచెత్తింది.

'మురారీ! ఇంత పతనమయి పోయావెందుకని? పదిమందికీ ప్రాణదానం చెయ్యాల్సిన నీవు—ఒక్క ఆడదాని కోసం ఇలా నాశనమయి పోయావంటే...' ఏడుపు మాటల నాపేసింది.

'ఏడ్చి ప్రయోజనం లేదు వాసంతీ! గతజల సేతుబంధనంతో ప్రయోజనం లేదు పుడుతున్నాము. గిడుతున్నాము — మధ్యలో ఎన్నో మజిలీలు! వచ్చిన పని అయిపోయింది. పోవడం కోసం యెదురు చూద్దాము...'

'ఈ వేదాంతం ఎప్పటినుండి మొదలయింది మురారీ? పాన పాత్ర చేతికొచ్చే కేనా? ఇంక నిన్ను వదలను సర్వనాశనం కాకముందే నాతో వచ్చేయి. పోదాము.' చెయ్యి పట్టుకొంది. నాలో ఏముందని లాక్కెళుతున్నావు వాసంతీ? ఈ నిర్ణయం పది, పదిహేనేళ్ల క్రిందట తీసుకొని ఉంటే బాగుండేది! ఇద్దరి జీవితాలయినా బాగుపడి ఉండేవి. ఇహ నన్ను వదిలేసెయ్. వాసంతీ!'

'మురారీ! నన్ను చిత్రవధ చెయ్యకు. నీముందే తలకొట్టుకొని చస్తాను.'

'వస్తాను వాసంతీ! నీ కోరిక కాదనటం ఎందుకు? చాలాకాలం తరువాత వాసంతి మొహం ఆనందంతో కళకళలాడింది. చిన్నపిల్లలా ఎన్నో కబుర్లు చెప్పింది. చాలా రాత్రయిం తరువాత 'పడుకో మురారీ ప్రొద్దుట లేద్దాము' అంటూ శనరూముకు వెళ్లింది.

ఉదయం పనికుర్రాడొచ్చి దబ దబ తలుపు బాదుతూంటే మెలకువ వచ్చింది.

'అమ్మగారూ! డాక్టరుగారు ఎంత లేపినా లేవడం లేదమ్మా! టేబిల్‌మీద ఈ ఉత్తరం ఉంది.'

అదిరిపడి ఆ ఉత్తరం అందుకొంది:

'వాసంతీ! అందరూ కలిసి నా బ్రతుకుతో చదరంగం ఆడుకొన్నారు. ముఖ్య పాత్ర నీది. కానీ నీకు తెలియకపోవచ్చు. నీ జీవితాన్ని నేను నాశనం చేశాను. కాదనడం లేదు. నీ దగ్గరకేముఖం పెట్టుకొని రాను? నా బలహీనతకు నీవు బాధ్యురాలెలా అవుతావు? ఈ బరువును నీపై రుద్దడం నా కిష్టం లేదు. అదీగాక నేను కొరనరీ పేషెంటును. అట్టే నాళ్లు బ్రతకను. ఎవరికోసం బ్రతకాలి? మోడువారిన మన జీవితాలు ఇక చిగురించవు. ఇంకో జన్మలో నయినా ఈ అన్యాయం జరగకూడదని దేవుని ప్రార్థిస్తున్నా. నీవు నన్ను వదలవు. అందుకని నేనే నిన్ను వదిలేస్తున్నా, బాధపడకు.

నీ మురారి.'

'మురారీ!' అన్న కేకతో వాసంతి మంచంమీదకు వాలిపోయింది. ●

# వారఫలం

## 18-9-1970 శుక్రవారం మొదలు 24-9-1970 గురువారం వరకు

**మేషం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారంమధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగా ఉంటాయి.

స్త్రీలకు— అధిక వ్యయం జరుగుతుంది. సంతానానికి సౌఖ్యమంతోపాలు లభిస్తాయి.

**కర్కాటకం.** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీరు శ్రమ పడినా, ప్రయోజనం ఉండదు.

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరుతాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**సింహం:** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య** సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు బంధుమిత్రులను కల్సుకొంటారు.

**తుల** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ... గా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం మధ్యలో అధికవ్యయం జరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరున వృత్తివ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అననుకూలమైన వార్తలను వింటారు.

**వృశ్చికం** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**ధనుస్సు.** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాటివారితో మాటపట్టింపులు తగవు. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన యిబ్బంది కలుగుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మకరం:** సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కుంభం** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ... గా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరుతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

—మహేష్


వయసులో ఉన్న పిల్లలు...
టాటా టెక్స్‌టయిల్స్ సూపర్-ఫైన్ పాప్లిన్ ప్రింటెడ్
దుస్తులు వేసుకుంటే ఎంతో అందంగా ఉంటారు.
ముద్దొచ్చే రంగులు, ముచ్చటైన డిజైనులు!
బాగా ఖరీదైన బట్టల్లా కనబడతాయి కాని బహు సరస
మైన ధరలు. చల్లదనం, సుఖం ఇచ్చే పాప్లిన్లు,
టెరీన్-కాటన్ బట్టలు, 2 × 2 వస్త్రాలు, కేంబ్రిక్
గుడ్డలు-ఎన్నని! అన్నీ వయసులో ఉన్న పిల్లల కోసం!
హుషారుగా ఉండే అందరికోసం!!
TATA Textiles




**జరిగిన కథ**

అనూరాధ తల్లి అన్నపూర్ణమ్మ. తమ్ముడు రాజా అన్నపూర్ణమ్మ కన్నబిడ్డల చదువుకోసం ఎంతో కష్టపడుతూవుంటుంది. ఒకనాడు అనూరాధ డాన్సు చూసి బహుమతినీయడానికి ఆగంతుకుడుగా వచ్చిన డా. హరికృష్ణ పరిచయమవుతాడు. హరికృష్ణ ఆమెను ఆకర్షించాడు. హరికృష్ణకి రేయింబవళ్లు పరిచర్యలు చేస్తున్న అనురాధపై అయినవాళ్లు భాండాలు వేస్తారు. ఆస్తికోసం హరికృష్ణకి పిచ్చెక్కిందనే వార్తనికూడా సృష్టిస్తారు బంధువులు. అనురాగమయి అనురాధ అన్నీ సహిస్తూ వూరుకున్నది. హరికృష్ణ లేనిసమయం చూసి అనురాధను ఇంట్లోంచి వెళ్లగొట్టాలనే ప్రయత్నం కూడా జరిగింది.

# 10

శారద, చంద్రాన్ని గురించి వివరంగా చెప్పింది. 'తండ్రిని మించిన దుర్మార్గుడు. తేనె లొలికిస్తూనే జీవితాలనే కబళించివేయగల సాహసం వుంది అతనిలో. చదువూ, సంధ్యా లేకుండా కాలాన్ని గడిపేస్తున్నాడు. ఉత్త పోకిరీరాయుడు. జాగ్రత్త!' అన్నది చివరలో హెచ్చరించుతూ.

'ప్రేమ అంటే వినోద వస్తువు అని అతని అభిప్రాయం! మరి ఎలా వెలుగుతావో' మరోసారి హెచ్చరిక కలిపింది.

'అక్కా! అనూరాధ చుట్టూరా, వో మధురమూర్తి అల్లిన అనురాగబంధం వుంది పద్మవ్యూహంలా. ఛేదించడానికి అతను అభిమన్యుడు కాదుగా!'

'అర్జునుడే రావాలంటావు!' నవ్వింది శారద

అనూరాధ కనులలో అనురాగం, సిగ్గుతో మల్లెమొగ్గే అయ్యింది.

* * *

మద్రాసులో మరో మూల వెదికించింది అనూరాధ ఆమెను చంపుకోలేక. మధ్యాహ్నం! ఎండ అంత తీవ్రంగా లేదు వర్షం వచ్చే సూచనలు కన్పించుతున్నాయి అంబరాన. హాల్లో కూర్చుని పేపరు చూస్తోందామె.

'ఎక్స్‌క్యూజమి! మేడమ్! లోపలికి రావచ్చునా?' వో స్వరం మర్యాద ఉట్టిపడేట్టు వినిపించింది.

పేపరు మడుస్తూ తలెత్తింది అనూరాధ.

సీమనుంచి అప్పుడే దిగి వచ్చిన దొరలా, హుందాగా నిల్చుని వున్నాడో యువకుడు. నల్లకళ్లద్దాల్ని తీసి విలాసంగా చేతిలో వుంచుకున్నాడు. తెల్లని పాంటూ, షర్టూ! కోటూ! అతని హోదాని మరింత పెంచాయి.

కొంటెంగా చిలిపితనం తొంగి చూస్తోందా కనులలో. రాజవంశంలోనుంచి వచ్చినట్లు ఠీవిగా నిలబడి వున్నాడు గుమ్మంలో.

అతడే రామనాథంగారి సుపుత్రుడు, చంద్రం అని గ్రహించింది అనూరాధ!

'రండి! ఈ యిల్లు మీకు కొత్తగాదు' లేచి నిల్చున్నది ఆమె.

'రియల్లీ అయామ్ వెరీ గ్లాడ్ మీట్ యూ! ప్రఖ్యాతిగాంచిన నాట్యతార, అనూరాధగారే ననుకుంటాను!' ఇంగ్లీషులో సాగిపోతోంది సంభాషణ.

'క్షమించాలి! చంద్రంగారూ! నేనింకా తాను గాలేదు. దయచేసి తెలుగులో మాట్లాడండి. నా మాతృభాష అర్థం చేసికోలేని పరిస్థితి రాలేదు.' మృదువుగా వినపించిందామె స్వరం.

'యస్! ఆల్‌రైట్! మీరన్నట్లు తెలుగు నాక్కూడా ఎంతో అందంగా వుంటుందన్పిస్తుంది. మీ అభిరుచి చాలా చాలా విలువైనది' ప్రశంస పొర్లింది.

'అమ్మను, అమ్మగా ప్రేమించడంలో గొప్పతనం వుందని నేననుకోను.'

'గొప్పతనం అని నేననడంలేదే! మీ మాతృభాషాభిమానం నాకు నచ్చిందంటున్నాను' మలుపు తిరిగింది సంభాషణ.

'నాన్నగారు చెప్పే వుంటారనుకుంటున్నాను. మద్రాసు మావాళ్లని ఎప్పటినుంచో అనుకుంటున్నాము. ఇప్పటికి తీరిక దొరి

కింది వేధపడి! ఈ బిజినెస్ వుంది చూడండి! మనిషిని పిచ్చి పిచ్చి చేస్తుందనుకోండి!'

'నాకు వ్యాపారం గురించి ఎంత చెప్పినా తలకెక్కదు నా నుంచి ఏ అభ్యంతరమూ రాదు మీకు మద్రాసు చూడండి! బొంబాయి వెళ్లండి! నాకు .....'

'షేడవ్స్! ఈ వేళలో మీ డ్రస్సు ప్రోగ్రామ్ వుందా? ఎక్కడైనా? చూడాలని ఎన్నాళ్ళనుంచో ఉహ ఉహలాడి పోతున్నాను'

'లేదు!' ముక్తసరిగా వచ్చింది జవాబు.

అయినా అతడు రవ్వంత కూడా నిరాశ చెందలేదు. ఏదో హెచ్చరించబోయాడా మైన. అనూరాధ 'వస్తాను! వంటవేళ మించిపోయింది' అంటూ వెళ్ళిపోయింది అక్కడనుంచి.

నౌకరుతో చెప్పి చంద్రంకోసమై వో గదిని కేటాయించింది.

'అమ్మా బాబుగోరు మా పెద్ద తిక్క మడుసులనుకోండి. సీసాలు సీసాలు తాగేత్తారు. ఇల్లంతా గొడవ సేసేవోరు. అయ్యగోరు కోపం వచ్చి వెళ్లిపొమ్మనేవోరు' అన్నాడు జోగులు.

విని వూరుకుంది అనూరాధ మౌనంగా.

భోజనం దగ్గర్నుంచి, పక్క వేసేవరకూ అతని గదిలోకే పంపించుతోందామె. ఎంత ప్రయత్నించినా ఆమెతో మాట్లాడే అవసరమే రావడం లేదతనికి. అతడు లేచే సరికే ఆమె స్నానపానాదులు ముగించుకుని ఏదో పుస్తకంలోకి వంగిపోయి వుంటుంది.

చంద్రం వచ్చి పది రోజులైంది. అతడానాడు అనూరాధ ఏదో అల్లుకుంటూండగా వచ్చాడు.

'క్షమించాలి! వో నాలుగు వందలు సర్దగలరా?'

'అంత గొప్పవాళ్లం గాదు మేము!' సౌమ్యంగానే వున్నదామె స్వరం.

'పోనీ వో వందన్నా సరిపోతుంది. వో స్నేహితుడు మంచి ఆపదలో వున్నాడు. సాయం చేస్తానని మాట యిచ్చాను. కానీ......'

'మీ అవసరాల్ని గమనించడానికి నేనేమీ పి.ఏ.డి.ని గాదు లెండి! అంత అవసరం అయితే శారదక్కయ్యను అడగండి వెళ్లి. తప్పకుండా యిస్తుంది.' అన్నదామె.

'శారదగార్ని అడగమంటున్నారా? అబ్బే! అంతదాకా ఎందుకు లెండి! నేనే చూసుకుంటానులే!' వెళ్ళిపోయాడతడు.

'అమ్మగోరూ! మీ దగ్గర సాచిక పారడంలేదయ్యగోరికి!' నౌకరు నవ్వాడు.

ఆ రాత్రి పది గంటలైనా చంద్రం యిల్లు జేరనే లేదు.

'జోగులూ! మళ్ళ పడుకో పోయి! అతను వస్తే నేను తలుపు తీస్తానులే!' అన్నదామె అతనికి నిద్ర ముంచుకు రావడం గమనించి.

శరత్‌బాబు 'శేషప్రశ్న', చదువుతూ కూర్చుందామె. పదకొండు కొట్టింది గడియారం. పుస్తకంలోంచి తలెత్తిందామె. నిదుర వస్తోందనుకుంటూ లేచింది. ఇంతలో తలుపుదగ్గర బూట్ల ధ్వని వినిపించింది.

వెళ్ళి తలుపు తెరిచింది. బ్రాందీ వాసన ముక్కుపుటాల్ని బద్దలు కొడుతోంది. అతని కళ్లు జ్యోతుల్లా ఎర్ర బడి వున్నాయి. మనిషి నిషాతో తూలి పోతున్నాడు. అనూరాధ ప్రక్కకు తప్పుకుంది. అమెను చూడగానే నవ్వాడు. ఏదో వాగబోయాడు.



'హుష్! మాట్లాడకండి! ఇక్కడ వినేవాళ్ళెవరూ లేరు! ఇదిగో! తాళం! గేటు మూసిరండి! నౌకరు యింతవరకూ మేల్కొని ఎదురు చూడడానికి రాక్షసుడు గాదు' తాళం బల్లమీద వుంచి తన గదిలోకి వెళ్ళి గడియ పెట్టుకుందామె.

ఆ యువకుని నిషా సగంపైగా సరకు దిగిపోయింది. గేటువేసి మరీ రాక తప్పింది గాదతనికి.

ఉదయాన లేచి ముఖం కడుక్కుంటూ ఉండగా అన్నది అనూరాధ—

'ఈ యింట్లో నిషాచిందులు వేయడం ఎవరికీ నచ్చదు. అంతే కాదు. ఇది దివాణం గాదు, అర్ధరాత్రివరకూ వేచివుండడానికి. డాక్టరుగారు లేకపోవచ్చు! కానీ యిది ఆయన యిల్లు. ఇలాంటి అభిరుచులు నచ్చవు వారికి' నిప్పురవ్వలా చురుక్కుమంది వ్యంగ్యం.

అతని ముఖం నల్లగా మాడిపోయింది. అయినా వెంటనే నవ్వు పులుముకున్నాడు నేర్పుగా—

'హాహా! రాత్రి సంగతి గదూ! మీరంటున్నది! నాకు చిన్నతనంలో జబ్బు చేసి నీరసంగా అయిపోయానట! వో ఫారిన్ రిటరన్డ్ డాక్టర్ యీ బ్రాందీ కానీ, మరోటిగానీ తీసుక్కోమని సలహా యిచ్చాడు. అప్పటినుంచి అలవాటయ్యింది

# ఆరాధన

—దాసివలెన...'

'మీకు నష్టం కన్పించకపోవచ్చు. కానీ యీ వాతావరణంలో వుండదలచుకున్న వాళ్ళు నిషా గురించి ఆలోచించగూడదన్న నియమం వుంది. కథలు వినేంత సరదా లేదిక్కడ ఎవరికీ' అన్నదామె.

'మీరన్నారు గనుక ఒప్పుకుంటా మానడానికి ప్రయత్నించుతాను' వినయంగా వచ్చింది సమాధానం.

అనూరాధ విన్పించుకోనేలేదా మాటల్ని. తనపనిలో లీనమైపోయిందెపుడో.

మరునాడు చంద్రం వో వేయి రూపాయలు తెచ్చి ఆమె ముందుంచాడు—

'శ్రమ అనుకోక కాస్త దాచి వుంచండి. నాన్నగారు ఎవరికో యిమ్మని పంపించారు. అతనేమో లేడిక్కడ! నాదగ్గర వుంటే ఖర్చయిపోతాయి.' అన్నాడు.

అనూరాధ కనులెత్తి చూడకుండానే అన్నది—

'క్షమించాలి! ఒకరి డబ్బు దాచేంత సమర్థత లేదింకా నాలో'

'గుడ్! నిజంగా మీ అభిప్రాయాలన్నీ నాలాగే సింపిల్‌గా వుంటున్నాయి.' పొర్లి మరీ ప్రశంసల్ని దువ్వుతున్నాడతడు.

అతడు చిన్నబోకుండా తన అలవాటు కూడా అలాంటిదేనంటూ, ఆమెను తన వైపు ఆకర్షింపజేయాలని అనుకున్నాడు. కానీ ఆమె శిలావిగ్రహంలా కదలకుండా కూర్చుంది. ఎంత నేర్పును ప్రదర్శించినా ప్రయోజనం శూన్యమే అవుతోంది.

అయినా నిరాశతో వెనుదిరిగిపోదలచుకోలేదా ప్రత్యర్థి. ఆమె కన్నా మొండిగా, ధైర్యంగా నిలబడాలని నిశ్చయించుకున్నాడు.

ఆ సాయంత్రం వో నలుగుర్ని వెంటబెట్టుకుని వచ్చాడు. అనూరాధ స్వెట్టరు అల్లుకుంటోంది.

'క్షమించాలి! మా మిత్రబృందం ఎప్పటినుంచో మిమ్మల్ని చూడాలని తపించిపోతున్నారు' అంటూ ఒక్కొక్కరినీ పరిచయం జేశాడు.

అందరికీ ప్రతి నమస్కారాలు చెల్లించిందామె. అందులో ఒకతను అన్నాడు—

'హరికృష్ణా, నేనూ 'మెడిసిన్'లో క్లాస్‌మేట్స్‌మే! అతను నేనూ కలిసి ఎన్నో వూళ్ళు తిరిగేవాళ్ళం సరదాగా!'

కనులెత్తి చూసిందామె. ఆ యువకుని వంక చూడగానే ఆ చెప్పినదానిలో యదార్థం రవ్వంతైనా లేదని గ్రహించింది. హరికృష్ణ ఏనాడూ సరదాగా తిరిగినట్టు శారదకు కూడా గుర్తులేదు. ఇదంతా 'చంద్రం', ఆడుతూన్న నాటకంలో వో భాగం అని గుర్తించింది అనూరాధ.

'పాపం! ఎంతో మృదు హృదయుడు! పిచ్చి ఎక్కిందని విననే మేమందరం చాలా బాధపడ్డాం! ఇంతకూ ఎక్కడైనా వున్నట్టు తెలిసిందాండి!' - సానుభూతి ప్రదర్శించాడు.

'తెలిసింది! మీలాంటి మిత్రులెవరో ఆయనను తమదగ్గరే వుంచుకుని మనిషిగా మార్చాలని చూస్తున్నట్టు తెలిసింది.'

వ్యంగ్యం ఛెళ్ళుమన్పించింది ఆ జవాబు విన్న వెంటనే.

'మీరు నృత్యం మానివేశారా?' మరో మిత్రుడు ప్రశ్నించాడు.

'అని ఎవరన్నారు?'

'చంద్రం అన్నాడు మొన్న!'



'శారు! ఎందుకు మానేశారు? ఆత్మీయులు మనసుపడి అడిగినపుడు తప్పకుండా అంగీకరించుతాను.'

చంద్రం ముఖం వెలవెల బోయింది.

ఈ మా చిన్న కానుకని కాదనకండి! మీరు అజంతామహల్లో ప్రదర్శన యిచ్చినపుడే యివ్వాలనుకున్నాను. కాని పరిచయంలేక ఆగిపోయాను.' అంటూ వో రిస్ట్‌వాచ్ ఆమె కందించబోయాడా మిత్రుడు.

అనూరాధ దానివంకైనా చూడకుండానే అన్నది.

'క్షమించండి! ఇంత విలువైన కానుక అందుకునేంత అర్హత లేదిపుడు నాలో!' మృదువుగా తిరస్కరించింది.

'నేను చెప్పలేదు బ్రదర్! అనూరాధగారెంతో నిరాడంబరమైన మనుషులని బహుమానాల్ని అందుకోవడం యిష్టం వుండదామెకని నేను చెప్పాను కానీ ... వీడే...'

చంద్రం యింకా అల్లబోతున్నాడో అందమైన కథని.

'దీనిలో ఆడంబర, నిరాడంబరాల ప్రసక్తి ఎందుకు? కానుకలు స్వీకరించుతాను. కానీ యిపుడు సమయం గాదన్నాను. హరికృష్ణగారి స్నేహితులు గనుక నా అభిప్రాయాన్ని చెప్పాను.

మరోసారి చంద్రంలోని అహం దెబ్బతిన్నది. అయినా పడగవిప్పే వుంది ధైర్యంగా.

వాచీని బహూకరించదలచిన మిత్రుడు చిన్నబోయాడామాటతో. ఆ వ్యంగ్యోక్తి అతనిలోని అబద్ధాన్ని, హరికృష్ణ నాకు మిత్రుడు అన్న వచ్చి అబద్ధాన్ని సవాలు చేసిందని గ్రహించాడు. అందుకే మళ్ళీ నోరెత్తనే లేదా మానవుడు.

చంద్రం ఏదో విధంగా ఆమెతో వో ప్రదర్శన యిప్పించాలన్న పట్టుదలతో ఒప్పించ జూశాడు. మిత్రులతో అడిగించాడు.

కానీ అనూరాధ! ఇప్పుడు వీలుపడదు? మీరంతా కళా హృదయులు. సంస్కారం మూర్తీభవించిన మనుషులు! నాకు సోదరులు గనుక చెబుతున్నాను.

మనస్సు విరిసిన మల్లియలా వున్నప్పుడే కళామయులుగా నటించ గలుగుతారు. అంతవరకూ వేచి వుండగలరనే నమ్ముతున్నాను.' అన్నది.

చంద్రం వోడిపోయానని ఒప్పుకోవలసి అంతకుముందు చెప్పిన ...
వచ్చిందా అస్త్రప్రయోగంతో.

'అలాగే! ఒక్క మనవి! కొంత

ఆ రాత్రికి అక్కడే భోజనం అని ఆలస్యమౌతుంది. హరికృష్ణగారి తివా

చెప్పేడందరముందే అది అనూరాధతో ఇంట్లో ఖజానా అజమాయిషీ ఇవ్వడం

వాళిగాదు. అందుకని ఈ మీ చెల్లెలు స్వయంగా వంటచేసి వడ్డించేంతవరకూ వేచి వుండాల్సిందే! ఒకసంగతి గుర్తుంచుకోవాలి—చంద్రంగారు జమీందారు పుత్రులు. కానీ అనూరాధ అంత లక్ష్మీ సంపన్నురాలుగాదు. వంటలు కోరినవి గాక పోవచ్చు. కానీ చెల్లెలిగా ఆప్యాయతకు మాత్రం ఏలోటూ రాదు.' అన్నది అనూరాధ మృదు మధురస్వరంతో.

వచ్చిన ఆ నలుగురూ ముగ్ధులై పోయారా మృదుత్వానికి. చంద్రం అంటే ఆ క్షణంలో ఎంతో ఏవగింపు కలిగింది అందరికీ. అతడు తలవంచుకుని పేక ముక్కల్ని కలుపుతూ తనకు కలిగిన అవమానభారాన్ని అణుచుకుంటున్నాడు.

వో అరగటలో కబురువచ్చింది! 'వంట అయింది! లేవండి!' అంటూ.

ఆరాత్రి ఆగృహాన సందడి విందు చేసింది నలుగురి హృదయాలు ఆనందంతో విండేట్లు.

* * *

చంద్రం ఆడుతూన్న నాటకం గురించి అంతా వివరంగా తెలుసుకున్నది శారద, నౌకరు, జోగులుద్వారా. అనాడు తీరిక జేసుకునివచ్చి అనూరాధతో మాట్లాడుతూ కూర్చుంది.

## ఆరాధన

'ఊ! అయితే! మంచిపథకం అల్లుతున్నాడన్న మాట. అనూ! కొంతమంది చాలా చిత్రంగా ప్రవర్తించుతారు ఎదుటి వాళ్లకు లొంగిపోయినట్లు నటించి లొంగదీసుకుంటారు. తరువాత తమ నిజస్వరూపాల్ని 'విశ్వరూపం'లా ప్రదర్శించుతారు. చంద్రం అచ్చు అలాంటి మనిషే!' అన్నది శారద.

'నిజమే! ఈ అనూరాధను ఎంతో సులభంగా మోసగించగల ననుకుంటున్నాడాతడు. కానీ అదృష్టం యింకా కలిసి రాలేదని బాధపడుతున్నాడక్కా! నాచుట్టూరా పద్మవ్యూహాన్ని అల్లి విలవిలా తన్నుకుంటూంటే వినోదం చూడమని పంపించారు రామనాథంగారు. కొడుకు సర్వవిధాలా ప్రయత్నించుతున్నాడు. హరికృష్ణగారు రాకముందే ఈ యింటినుంచి నన్ను వెళ్లగొడితే గానీ వాళ్లపథకం నెరవేరదు. అందుకే విశ్వప్రయత్నం చేయబడుతోందిపుడు.'

శారద లోలోన నిట్టూర్చింది, హరికృష్ణ యింకా వస్తాడన్న నమ్మకం అనూరాధకు వున్నందుకు.

'అనూ! వోమాట అడుగుతాను! అపార్థం జేసికోవద్దు! ఈ అక్కయ్య నీ సుఖంకోసం అహర్నిశలూ తపించుతుందని నీకు మరోసారి చెప్పనవసరంలేదని నాకుతెలుసు. హరికృష్ణ బావ తిరిగి మన కళ్లముందు నిల్చుంటాడా? అని నా సందేహం' అనూరాధ కనులలోకి చూస్తూ అన్నదామె.

'నీభయం నాకుతెలుసు అక్కా! ఒక మాట గుర్తుంచుకో! ఆయన వస్తారనే ఎంతో ఆశతో ఎదురు చూస్తున్నాను. ఈ జీవితం ఆశాకుసుమాలతో అల్లిన అందాలమాల ఆమాలలో కొన్ని కుసుమాలు వాడిపోవచ్చు రాలిపోవచ్చు. కానీ ఆశ చావదు. ఎంత అంధకారంలోనైనా ఆశాదీపం వెలుగు విరజిమ్ముతూనే వుంటుంది. ఆదీపం దారిచూపుతుందనే నా ప్రగాఢ విశ్వాసం!' అన్నదామె గంభీరంగా.

ఆ పైన శారద మాటాడలేక పోయింది.

'నీ ఆశ ఫలించాలనే దీవించుతున్నాను అనూ! వస్తానుమరి! సతీశ్ వచ్చి వుంటా రీపాటికి!' సెలవు దీసికున్నదామె.

ఆనాడు చంద్రం ఎక్కడికీ బయలుదేరలేదు. మద్రాసు చూడాలని వచ్చిన వాడు శాశ్వతంగా అక్కడే వుండేవాడిలా ప్రవర్తించు తున్నాడు. మాట వరుసకైనా 'వెళ్తాను' అని అనడమే లేదు.

అనూరాధలో కించిత్ ఆశ్చర్యం జనించింది, అతడు యింటిపట్టున వుండడం చూసి. ఏదో బృహత్పథకం అల్లుతున్నాడని గ్రహించింది.

మధ్యాహ్నం కాగానే అతడు అనూరాధ గదిముందర నిలబడి అన్నాడు—

'లోపలికి రావచ్చునా ?' అని.

హరికృష్ణ తలపులతో వూగిపోతున్న అనూరాధకా పిలుపు ఏమాత్రమూ సంతోషాన్ని కలిగించలేదు.

'ఆజ్ఞాపించడం అందరి యెడలా మంచిదికాదు చంద్రంగారూ! మరొకటి! ఆజ్ఞాపించ బడడం కూడా అన్నివేళలా అందంగా వుండదు. కొన్నిసార్లు మనిషిని కించ పరుస్తుందా అలవాటు.' అంటూ హాల్లోకివచ్చి సోఫాలో కూర్చున్నది అనూరాధ.

కత్తికి రెండువైపులా పదునువుండడం



దూసి వాయి మెదపలేక పోయాడా యువకుడు వెంటనే.

'మీ మాటలు వింటూంటే నాకు చదువుకోవాలని బుద్ధి పుడుతోందండీ ! ఇంటరు పాసయి మానివేశాను. బి. ఏకు కట్టమంటారా ? ఏ వ్యాపకమూ లేక విసిగిపోతున్నాను.' ఎదురుగావున్న సోఫాలో కూర్చున్నాడతడు.

'మనిషికి వయస్సు కొంచెం పెరిగిన తరువాత ఎదుటివారినుంచి సలహాలు ఆశించినట్లయితే ఆత్మవిశ్వాసం, కుంటు పడుతుంది.'

# ఆరాధన

చంద్రం నివ్వెరపోయాడా మృదువైన వ్యంగ్యోక్తికి.

'నిజమే ! నాన్నగారూ యిలాగే అంటూంటారు ఎపుడూ. తెలుగు మీకు ఎంతో బాగా వచ్చుననుకుంటాను. కాస్త తెలియనిదేమైనా వున్నపుడు చెప్పించుకోమని నాన్న నిన్ననే వ్రాశారు.' పథకం అమలులోకి రాబోతోంది.

'మీకు జోస్యం కూడా తెలుసునను కుంటానే! కానీ జోస్యం నూటికి నూరు పాళ్లా నిజం గాదు చంద్రంగారూ ! తెలుగులో నాకసలు చెప్పదగిన ప్రావీణ్యతే లేదు అదీగాక ఒకరికి చెప్పేంత అనుభవం లేదింకా నాలో.'

'ఆల్‌రైట్ ! దీనికంతగా బాధపడవద్దులెండి ! అపుడపుడు 'చదువుకో' మని మాత్రం ఈ బద్ధకస్తుణ్ణి హెచ్చరించు తూండండి ! ఆ మాత్రం చాలు' వోడిపోయినా వెనుదిరగడం ఆ వ్యక్తి జీవితంలో లేనట్లుంది.

అనూరాధకు నవ్వొచ్చింది అతని పట్టుదల చూడగానే.

'బావకోసం వెదికించు తున్నారాండి ?'

అనూరాధ కనులెత్తి చూసింది. అతనిలో ఏ వుద్దేశ్యం పరువులు పెడుతుందా అని. ఆ ప్రశ్న అభిమానంతో వేసినది గాదని, ఏదో దాగివుందని గ్రహించ గలిగింది.

'మీరే మనుకుంటున్నారు ?'

ఆ ప్రశ్న వస్తుందని అతడు వూహించనే లేదు. కానీ జవాబులు ఎంత అర్థ రహితమైనవైనా సరే ఎల్లపుడూ సిద్ధంగానే వుంటాయి అతని హృదయ కుహరాన.

'వెదికించు తున్నారనే అనుకుంటు న్నాను. కానీ మీ శ్రమకు ఫలితం వుండదనిపించుతోంది.' లౌక్యం వంపులు తిరుగుతోందతని కంఠాన.

'అని మీ కెవరు చెప్పారు !'

'మీకు కోపం వచ్చిందనుకుంటాను. నా మనస్తత్వం చాలా వింతగా వుంటుంది. మనస్సులో దేన్నీ దాచుకోలేను. అందుకే నేనంటే చాలామంది విసుక్కుంటారు. 'బ్రతకడం చేతగాని బడుద్ధాయివిరా!' అంటారు నాన్నగారుకూడా !'

అందంగా నవ్వాలని ప్రయత్నించాడతడు. కానీ ఆ నవ్వులోని అందం చూడకుండానే అన్నదామె—

'అబద్ధాలు ఆడడం రాదు — అని చెబుతూనే విలువెల్లా అసత్యం అన్న నిషాలో నింపుకుంటున్నారు కొందరిపుడు. చూడండి! ఎంత మోసమో!'

డాక్టర్ కబుర్లు

## నోటిలో దుర్వాసన

కొందరి ఊపిరికి దుర్వాసన లేకపోయిన వారికి ఆ అనుమానం ఉంటుంది! చుట్టుపక్క వారు మొహమాటపడి ఆ సంగతి చెప్పరని అనుకుంటూ ఉంటారు. ఈ అనుమానాన్ని తీర్చటం తేలిక. ఒకసారి డాక్టరు పరీక్ష చేస్తే చాలు.



అసలు దుర్వాసన రావటానికి కారణాలు ఏమిటి? ఇవి ఎన్నో రకాలు. తలలో చెవి, ముక్కు, గొంతుకకి సంబంధించిన నాళాలు కొన్ని ఉంటాయి. వాటిలో లోపాలు ఉంటే దుర్వాసన రావచ్చు.

వీటిని కనుగొనటానికి ఎక్స్-రే పరీక్ష చెయ్యవచ్చు.

అదేవిధంగా పళ్లు చెడిపోతే కూడా నోటిలోనుంచి దుర్గంధం రావచ్చు.

ఇక ఊపిరితిత్తులలో విష క్రిములవల్ల బాధ ఏమయినా ఉంటే అప్పుడూ నోటిలో దుర్వాసన రావచ్చు.

పయిన చెప్పిన వాటివల్ల దుర్వాసన ఏదీ లేకపోతే జీర్ణకోశంలో దోషంవల్ల నోటిలో నుంచి దుర్వాసన వెలువడ వచ్చు. దీనికి క్షుణ్ణమయిన పరీక్ష అవసరం.

కొందరికి చిన్న చిన్న అనారోగ్యాలవల్ల అకారణంగా కనిపించే జ్వరాలు వచ్చిపోతూ ఉంటాయి. వీటివల్ల కూడా శ్వాసకి దుర్వాసన రావచ్చు. ఈ జ్వరాలు రావటం ఆగిపోతే వాసనకూడా ఆగిపోతుంది.

(కాపీరయిటు)

చంద్రం నిర్ఘాంతపోయాడు. ఆ మాట తనను గురించే వినబడిందని గ్రహించాడు. కానీ వెంటనే తమాయించుకుని అన్నాడు—

'ఈ చంద్రం మాత్రం ఆ కోవకు చెందడండోయ్!' నవ్వబోయాడతను.

'అని నేనన్నానా యిపుడు?'

'మీరనలేదనుకోండి! మీ రంటే వున్న గౌరవంతో వున్నమాట అన్నాను.' మరో ప్రశంస వినబడింది.

ఏ పలుకులో ఎంత చాకచక్యంగా ప్రశంసోక్తుల్ని రువ్వాలో అతనికి బాగా తెలుసునని గ్రహించింది అమారాధ.

'ప్రశంస మూలాన నష్టాలే ఎక్కువ!' అన్నందుకే. సంభాషణ ఆకస్మికంగా మరో వైపుకు తిరగడంతో ఓ క్షణం సేపు ఆగిపోవలసి వచ్చింది అతని వుపన్యాసధార.

'కరెక్ట్! నా అభిప్రాయం కూడా అదేనండీ!'

'ఆ అభిప్రాయం వున్న వాళ్ళు ఎక్కువగా మాట్లాడలేరని విన్నానే!' ఆపైన మరో అక్షరం కూడా పెదవి దాటి బయటికి రాలేదు. ఏమంతంటూ లేచి వెళిపోయాడక్కడ నుంచి. ఆమె నోట నుంచి మీరు మంచివారు, అన్న మాట రప్పించాలనీ, అతనెంతగానో ప్రయత్నించాడు. ఏదో విధంగా సంభాషణలో దింపి తన అభిప్రాయానుగుణంగా ఆ త్యాగమయిని మలచాలని, తద్వారా తన అడ్డును తొలగించాలని నిశ్చయించుకున్నాడతను.

కానీ అతని ఆ వుద్దేశ్యం నిమూలంగా చెకలించబడుతోంది కొన్నిసార్లు. అయినా నిరుత్సాహ పడగూడదనుకున్నాడా యువకుడు.

(ఇంకా వుంది)

# ఒక వారం విపరీతం

## ఫాలాక్షుడు

### తాగుడు బానిస

వేలూరుకు చెందిన విరూపాక్షపురంలో 36 ఏళ్ళ మూర్తి అనే అతను తన ప్రేయసి తనకు డబ్బు యివ్వలేదని చివాలున ఉరేసుకు చనిపోయాడట. అతని ప్రేయసి పేరు రాజమ్మట. తాగుడికి బానిసై తన ఆదాయమంతా తాగేసి, అనక ప్రియురాలి నడిగితే ఆమె యివ్వలేదని యింట్లో దూలానికి ఉరిపోసుకుని ఆ మూర్తి నిండు ప్రాణాలను తీసుకున్నాడట.

### కాలిరాత ఇంజనీరు

1968 లో ఒక ప్రమాదంలో రెండు చేతులూ పోగొట్టుకుని, ఆ రోజునుంచీ కాలితో వ్రాయడం నేర్చుకుని, ఇంజనీరై దేశానికి సేవ చేయాలనే తన కోర్కె తీరకుండా పోయిందని బాధ పడుతున్న 10 సంవత్సరాల సుమిర్ అనే కుర్రాడికి లండన్ లో ఒక శిల్పి క్షనిక్ చేతులు ఉచితంగా యివ్వడానికి సమ్మతి ప్రకటించిందట.

### నన్‌ల ఎగుమతి

యూరోపియన్ కాన్వెంటులలో క్రైస్తవ కన్యల కొరత ఏర్పడం దాపటాని ప్రపంచమంతా వెతికి హిందూదేశం వచ్చి కేరళ చూసి బాగుంది అనుకున్న దేశాలు కేరళ స్త్రీలను తీసుకుపోతున్నారట. కేరళనుంచి యిప్పటికి సుమారు 12 వందలమందిని పై దేశాలు తీసుకుపోయారట. ఒక్కొక్క అమ్మాయిని 720 డాలర్లు [54 వందల రూపాయలు] యిచ్చి అక్కడ కొనుక్కుంటున్నారట. బ్రిటన్, ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సువంటి దేశాలు యీ కేరళ ఆడపిల్లలను తెగ దిగుమతి చేసుకుంటున్నారట—ఇంత రభసెందుకు-మా దేశం ఎవరెవరి కొస్తారో అంటే బోల్డుమంది లేరూ తయారుగా—కేరళలో ఒక క్రైస్తవ మత అధికారి హయాంలో యీ పంపిణీ జరుగుతున్నదట—పే....వాటే ఇండియా డూయింగ్!

### ప్రాణంతీసిన ఇల్లు

ఏలూరా అనే వూరిలో నిద్రపోతున్న ఓ కుటుంబంపైన యిల్లు కూలిపోయినందువల్ల ఆ కుటుంబంలోని ఏడుగురిలో తండ్రి, ఆఖరి కొడుకూ మాత్రమే బతికారుట—అది కూడా గాయాలతో.

### కుక్కలుపట్టిన దొంగలు

నెలమంగళ [బెంగుళూరువద్ద] ప్రాంతంలో ఒక కారును [14 తేదీ రాత్రి] ఆపి, లూటీ చెయ్యడానికి కొందరు ఆ కారు దారిలో కుక్కలను వదలారట. కుక్కలను చూసి, తక్కున కారాపిన డ్రయివరు అంతలో విషయం గ్రహించి రయ్యినవేగం ఎక్కించేసరికి ఆ దొంగలు చేసిన ప్రయత్నంలో కారుకి కొంచెం దెబ్బ తగిలిందటంతే! నీల మంగళ పోలీసు వారు ఆయుధాలతో అక్కడికి వెళ్ళి, దెబ్బతిన్న ఓ కుక్క ద్వారా ఆ దొంగలను పట్టేశారట.

### లంచంయిచ్చిన మంత్రి

కాన్పూరు ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిలో ఉద్యోగం కావాలంటే నికరంగా లంచం యిచ్చే తీరాలి అనే ఆరోపణ ఎంతవరకు నిజమో చూడబోయిన మనోహర్‌లాల్ అనే మంత్రి [లేబర్] గారు క్యూలో నిలబడి, అందరిలా తనూ ఓ 15 రూపాయలు లంచం చెల్లించి కొయ్యబారిపోయారట.

### నిరుద్యోగులు

దొరికిన లెక్కల ప్రకారం [ఎంప్లాయిమెంటు ఆఫీసు నమోదుల లెక్కలు] మన భారతదేశంలో నిరుద్యోగుల సంఖ్య మొన్న జూన్ 30 వ తేదీనాటికి 88,21,300 అనటాని ఆ శాఖమంత్రి సంజీవయ్య అన్నారట. ఉద్యోగాలు కావాలోయ్ అని ఆ ఆఫీసులలో తమ తమ పేరులు నమోదు చేయని నిరుద్యోగులు మరింత మందుండరూ!

ఎందు కుండరు! దేశం గొడ్డు పోయింది!

### దారుణమైన దోపిడీ

ఢిల్లీ ఠాకూరు గార్డెన్స్ ప్రాంతంలోని ఒక యింట్లో కొంతమంది ప్రవేశించి, ఇంటావిడ ధాత్రిదేవి నోట్లో గుడ్డలు కుక్కి, కళ్ళకి గంతలుకట్టి యిల్లంతా దోచేసుకున్నారట. ఇంటికి తిరిగివస్తున్న ఊర్మిళ కపూర్ అనే ఆమెను బెంగాలీ మార్కెట్టు [ఢిల్లీ] ప్రాంతంలో కొందరు కత్తి చూపించి బెదిరించి చేతిలోవున్న 42 రూపాయలూ లాక్కున్నారట.

### రోడ్డు ప్రమాదాలు

రోడ్డు ప్రమాద ఫలితాలు—వులలో తమిళనాడు ముందంజ వేసిందట. మహారాష్ట్రలో 528 చావులనీ, ఆంధ్ర[!] ప్రదేశ్‌లో 520 య్యేననీ, తమిళనాడులో మాత్రం 535 అనీ ఆ శాఖ వయిర్మన్ లెక్కలు తేల్చారట. అసలు మన దేశంలో రోడ్డు ప్రమాదాల అభివృద్ధి జెందుతునే వున్నాయట 1965 లో 12,057గా వున్న యీ సంఖ్య 1968 నాటికి 1,07532గా మారిందట— దేశం ఏదో ఓ కోణంలోంచి అభివృద్ధి చెందాలికదా ........యస్).

*  *  *

గ్వాలియర్ జిల్లాకు చెందిన మెహగావ్ అనే గ్రామంలో ఓ భూమి తగాదాలో ఆపూరి వారు కొందరు గ్రామ సర్పంచ్ బ్రిజ మోహన్‌శర్మ అనే ఆయన్ను చంపడమె గాక, ఆయన స్నేహితుడు సాహెబ్‌సింగ్‌ను కూడా చంపేశారట.



## థియేటర్లో హత్య

బెంగుళూరు నందీథియేటరులో సినిమా చూస్తున్న ఒకామె బాత్‌రూము [పాయిఖానా]కు వెళ్ళిందట. ఆమె వెనుకకూడా కొంతమంది ముస్లిమ్ స్త్రీలు బురఖాలవారు వెళ్ళారట. ముందెళ్ళినామె ఎంత సేపటికీ రాలేదేమిా అని చూస్తే, ఆమె నా బాత్‌రూములో ఎవరో దారుణంగా నోట్లో గుడ్డలు కుక్కి శరీరాన్ని మూడు ముక్కలుగా నరికి, వంటిమిాద నగలు తీసుకు పోయారట. ఏపేపరూ రాయని యీ వార్త పూరు చెప్పుకుంటోంది.

## అనుమానం-అమానుషం

తనతో పరిలేక పుట్టింట్లో వుంటున్న తన భార్య సురయాకోసం 28 ఏళ్ళ మహమ్మద్ అనే అతను అత్తారింటికి వెళ్ళి, నిద్రపోతున్న సురయాను లేపి, కత్తితో శక్తివంచన లేకుండా పొడిచి, అడ్డొచ్చిన అత్తమామలను, బావమరదు లనూ కూడా పొడిచి పారిపోయాడట. అతనికి భార్య నడవడికమిాద అనుమానం వుందని పోలీసు అనుమానిస్తోంది. ఇది ఢిల్లీవింత.

## నేతాజీ జీవన్మరణం!

నేతాజీ సుభాష్‌చంద్రబోసు జపాన్‌లో నిటాల్ పెష్ అనే చోట విమాన ప్రమాదంలో మరణించారని, ఆయన చితాభస్మం టోక్యోలోని షింజుకూ అనేచోట నో బౌద్ధ ఆరామంలో వదిలంగా వున్నదని, దాన్ని ఇండియాకు తరలించే ఏర్పాట్లు జరుగుతున్నవనీ వార్తలొచ్చాయి—, ఇది బై— నేతాజీ చనిపోలేదని మారు వేషంలో తిరుగుతున్నాడని కొన్ని పత్రికలామధ్య అనుమాన పడ్డాయికదా!

## నలుగురి సజీవదహనం

హరిజనులో నలుగురు చేరి తమ స్థావరాల్లో చేపలు పడుతున్నారన్న కోపంతో భువనేశ్వర్‌కి చెందిన తాయేడిహి అనే పల్లెలో చేపలు పట్టు [జాలర్లు] వారంతా చేరి, వారి నలుగుర్నీ చావబాది, అంతతో ఆగక వారి నో పాకలో పెట్టి ఆపాకకు నిప్పంటించి సజీవ దహనం చేశారట.

* * *

పూరి జిల్లాకు చెందిన పతిపూర్ గ్రామంలో, హిందూ కామందులకూ హరిజనులకూ సంఘర్షణ వచ్చేసరికి కామందులు తుపాకులతో హరిజనులను కాల్చేశారట. ఈ కాల్పులో ముగ్గురు హరిజనులు మరణించడమే గాక, మరో ఇద్దరు ప్రమాద పరిస్థితిలో ఆసుపత్రిలో వున్నారట. ఇంతకీ తగాదా ఎందుకు, ఎలా, దేని కోసం పుట్టిందో మాత్రం తెలీదు.

## రక్తపు [illegible] మనిషి

బెంగుళూరు సిటీ మార్కెట్టులో 12 తేదీ తెల్లవారు ఝామున 3—4 ల మధ్య వున్నట్టుండి వూపిరాగిపోయేలాటి గావుకేకొటి వినబడిందట. ఆకేకవోసిరు రక్తపు మడుగులోపడి తన్నుకుని చనిపోయివున్నాడట. ఆరాలమిాద, అవ్యక్తి పేరు పొన్నురంగం అనీ, అతని భార్యకు వేరే వ్యక్తితో సంబంధం వున్నదనీ, దాంతో ఆక్రితం రోజు ఆ వ్యక్తికి పొన్ను రంగానికి ఘర్షణ వచ్చిందనీ తేలింది.

* * *

గత వారంరోజులలో మైసూరు పోలీసు రెగ్యులేషన్ మోటారు రెగ్యులేషను రూల్సును అతిక్రమించి బెంగుళూరులో ఆ శాఖలకు పట్టుబడిన వారి సంఖ్య 10805 అట.

* * *

దేశంలో సాలీనా 150 కోట్ల రూపాయల విలువగల 'విషయాలు' స్మగ్లింగ్ వ్యాపారంలో చిందులేస్తున్నాయట.

* * *

సత్తుపల్లి అనే వూళ్లో 22 ఏళ్ళ సుబ్రహ్మణ్యం తను కాశ్రయమిచ్చిన వారి అమ్మాయి లక్ష్మిని ప్రేమించి, తనకిచ్చి పెళ్లి చేయమని [illegible] తల్లి సుబ్రహ్మణ్యం కోరాడట. తను [illegible] తిరస్కరించినందు వల్ల ఇంట్లో ఎవరు లేని సమయంలో లక్ష్మికి తన హృదయం విప్పి చూపిస్తుండగా ఆమె తమ్ముడు 12 ఏళ్ళ బలరామన్ వచ్చి అతణ్ణి దుమ్మెత్తి పోశాడట. దాంతో బలరామన్ మీద కక్ష పట్టి, ఆరాత్రి అతన్ని సినిమాకి రమ్మని సినిమా దారిలో బండరాయితో అతని తల పగలగొట్టి చంపేశాడట సుబ్రహ్మణ్యం.

* * *

పట్టూరు అనే గ్రామంలో గోవిందన్ అనే అతను నో కొబ్బరి తోటలో పడి కొబ్బరికాయల దొంగతనం చేస్తుండగా ఆ తోట యజమాని పరశురామన్, ఆయన నలుగురు కొడుకులూ చూశారట. దాంతో ఆ అయిదుగురూ అతన్ని పట్టుకుని చితక బాది, చావగొట్టారట. గోవిందన్ అక్కడే చనిపోయాడట—కొబ్బరికాయల దొంగతనానికి మరణశిక్ష—ఇట్లా వచ్చే...

* * *

ఇటీవలి వరదలవల్ల దేశంలో మొత్తం అన్ని చోట్లా జరిగిన నష్టాలను ఒకటిగా వేసుస్తే 1375 లక్షలని లెందట.

# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కధలు




అనువాదం: తిరుమల రామచంద్ర

ప్రియురాలిని పొందిన సుందర సేనుడు మతంగమునివద్ద ఆయన కుమార్తె యమునవద్ద సెలవు పొంది, మిత్రునితోపాటు తన పట్టణానికి బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళిన పిదప సముద్రతీరం చేరాడు. అక్కడొక వర్తకుని వోడ కనిపించింది. ఆ వర్తకుడు దూరంనుంచే హంసగామిని అయిన మందారవతిని చూశాడు. దుష్టబుద్ధి కలిగింది. 'మా వోడ ఎక్కండి' అని అన్నాడు. రాజకుమారుడు ఆ మాట విని మొదట రాజకుమారి మందారవతిని వోడ ఎక్కించి, తను తర్వాత ఎక్కుదామనుకుంటుండగా, వర్తకుడు తొందరగా వోడ నడిపించాడు. మందారవతి 'నాథా! నాథా!' అని అరుస్తుండగా, వర్తకుడు వేగంగా వోడ నడిపించుకుపోయాడు.

వోడ క్షణంలో కనుమరుగైపోయింది. రాజపుత్రుడు ఏమీ తోచక దుఃఖంతో భూమిమీద మూర్ఛతో కూలిపోయాడు. కొంతసేపటికి మెలకువ వచ్చింది. 'హా ప్రియే! ఎక్కడ వెళ్ళావు? చెప్పు. నన్ను చూడు.' అంటూ ఉన్మత్తుడై మరీ మరీ ఏడ్చాడు. అతనికి తుమ్మెదలలో ప్రియురాలి కేశపాశం, కలువలలో చూపు, లేత తీగలలో విలాసాలు, కనిపించి, ఆ వేడి ంటె దానిని స్మరించి ఏడ్చాడు. 'ఇదిగో నా ప్రియురాలు నాతో మాట్లాడింది' అంటూ, తుమ్మెదలు ఝుమ్మంటూ, గాలికి కదలాడుతున్న లేదీగను కౌగిలించుకున్నాడు. ఇది కాంతా కటాక్షమాల అని నెమలిపురిని చూచి, బాలచంద్రుని చూచి పండు అనే భ్రాంతితోను పట్టుకొనడానికి పిల్లవానివలె పరుగెత్తాడు.

అతడు ఇలా ప్రియా వియోగాగ్నితో మండిపోతుండగా, ఆ వేడి తనకు ఎక్కడ తగులుతుందోనని సూర్యుడు అస్తగిరి ఎక్కి సముద్రజలంలో మునిగిపోయాడు. మంజిష్ఠ వస్త్రం కప్పినట్టు, చక్రవాక పక్షుల శోకాగ్ని మూర్తీభవించి వ్యాపించినట్టు సంధ్యారాగం ఆకాశమంతటా విస్తరించింది.

తర్వాత సుందరసేనుని ఉగ్ర దుఃఖాగ్నితో పుట్టిన దట్టమయిన పొగలో అన్నట్టు చీకట్లు దిక్కులను కప్పాయి. కొంతసేపటికి రాత్రి చంద్రోదయాలం

ధంలో కలిగే తెల్లదనంతో, కర్పూర హారి చందనాలు అందుకొన్న వియోగిని లాగ కనిపించింది.

ఇంతలో ఎర్రటి చంద్రబింబం కనిపించింది. వియోగినుల చూపుల వేడికి కాలిపోతున్నట్టు అనిపించింది. ఆడ ఏనుగు దంతాలలాగ పాండురమైన చంద్ర కిరణాలు గగన లక్ష్మిని కప్పివేశాయి. దానిని చూడగా, గగనలక్ష్మి స్మరతప్త అయి విషమండలాల మధ్య వున్నదా అన్నట్టు వుంది.

వెన్నెలతో తెల్లనయిన ప్రపంచం కాలుతున్న కడాయిలాగ సుందరసేనునికి తోచింది. దానిలో అతడు తన ప్రియురాలిని గురించి విచారపడడం ప్రారంభించాడు. 'ఈ చంద్రుడు వెన్నెల అనే అట్టహాసంతో వెక్కిరిస్తూ, నా ప్రాణాలు తీయడానికి పూనుకున్న బేతాళునిలాగ వున్నాడు' అంటూ భూమిమీద పడ్డాడు. మూర్ఛపడిన రాజకుమారుణ్ని చూచి అతని మిత్రుడు విహ్వలుడై, కన్నులు నీటితో నిండగా దీనంగా ఏడ్చాడు.

తెల్లవారింది. రాజకుమారునికి మూర్ఛ విడింది. దుఃఖంతో, కాళ్లు తడబడుతూండగా, ఎక్కడో దిక్కు తెలియక నడుస్తూ, ఒక ఘోరమయిన అడవి చేరాడు. అక్కడ ఒక బోయపల్లె కనిపించింది. చమరీమృగాల వెంట్రుకలు పల్లెముందు కప్పి వున్నాయి. పులితోళ్లు భయంకరంగా వ్రేలాడుతున్నాయి. ఏనుగుల మాంసరాసులపై కాకులు మూగుతున్నాయి. వాటిని తోలడానికి ముసలి శబరులు వికారంగా కేకలు వేస్తున్నారు. అవి వింటూంటే, పిశాచాల కేకలలాగ వినబడుతున్నాయి. జింకలు చిక్కుకున్న వలలు మరొకచోట పడివున్నాయి. కుక్కలు మొరుగుతున్నాయి. అలాటి కిరాతపల్లిని చూచి త్వరత్వరగా తప్పుకొని వెళ్లసాగాడు.

ఇంతలో కొందరు విల్లంబులు ధరించిన శబరులు అతనిని చూచారు. అతనిని దుర్గాదేవికి బలి యిద్దామని పట్టుకోబోయారు. కాని శూరుడయినట్టివాడు గనుక సుందరసేనుడు పెక్కుమంది కిరాతులను చంపిన పిదప గాని వారికి పట్టుపడలేదు. అతనిని, అతని మిత్రుని కిరాతులు పట్టుకొని బందెలో తోశారు.

ఆశ్చర్యం! అక్కడ అతనికి తన వృద్ధమంత్రులు, చండుడు మొదలయిన మిత్రులు కనిపించారు. వారంతా సంకెళ్లతో బలంగా కట్టబడివున్నారు. 'దైవవశాన, ఈ వధ సమయంలో మనమెంతా కలుసుకొన్నాము' అని రాజకుమారుడు వారితో అంటుండగా, శబరులు, అతనిని, తక్కిన మంత్రులను చండికాలయానికి నడిపించారు.

చండికాలయంలో సుందరసేనుడు, చండికకు నమస్కరించి నిర్మల మనస్సుతో, విరహకృశుడయినప్పటికీ, ఒక్క అక్షరమయినా పొల్లుపోకుండా, స్తోత్రం చేశాడు: 'హా దేవీ నీకు జయమగుగాక! చంద్రచూడుని చూడాచంద్రుని కాంతితో నీ పాదకమలాల నఖకాంతి చంద్రికలు పెనవేసుకొని పెరిగిపోతాయి.'

ఇలా పార్వతిని స్తోత్రంచేసి, ఎలాటి ఒడుదుడుకు లేకుండా సుందరసేనుడు నిలబడ్డాడు. వారిని దేవికి బలి యివ్వడానికి పుళిందరాజా వింధ్యకేతువు కత్తి పట్టుకొని వచ్చాడు. నిర్వికారుడై నిలబడిన రాజకుమారుణ్ని వధించే క్షణంలో చూచాడు. 'హా! ఏమిటీ అన్యాయం! ఇతడు మన రాజుగారి కుమారుడు. మహాసేన మహారాజా నన్ను ఆటవిక రాజుగా చేశాడు. ఇతడు మహాశయుడయిన అతని కుమారుడు సుందరసేనుడు.'

ఇలా మహా సంభ్రమంతో అనివింధ్యకేతువు కన్నీరు కురుస్తుండగా, సుందరసేనుని కాళ్లపైపడి, మన్ననవేడి, అతనిని, అతని మిత్ర సచివాదులను తన భవనానికి పిలుచుకొని వెళ్లాడు. అక్కడ సుందరసేనుడు తన వృత్తాంతం తెలియజేసి, ప్రణయ శీలిఅయిన వింధ్యకేతువు సకలోపచారాలూ చేస్తుండగా, ప్రియురాలిని స్మరిస్తూ కొంతకాలం గడిపాడు.

ఒకసారి శబరేంద్రుడు సుందరసేనునితో గోష్ఠి జరుపుతున్నాడు. అప్పుడు శబరేంద్రుని సేనానివచ్చి ఇలా మనవి చేశాడు: 'దేవ తమ ఆనతితో ఈమహాధనవంతుడయిన సార్ధవాహుణిల గుంపును అడవిలో అడ్డగించాము. వారితో పోరాడి. వారి యజమానిని పట్టుకొన్నాము. ఇదిగో ఇక్కడికి తీసుకొని వచ్చాము. లేడి కన్నులవంటి అందమైన కన్నులున్న ఈ సార్ధవాహుని కన్య అదిగో వెనుక నిలబడి వుంది. నానాటికీ తరిగిపోతున్న చంద్రుడు ఈమె ముఖకాంతితోనే మరల మరల నిండుదనం సంపాదించుకొంటున్నాడని అనుకుంటున్నాను.'

శబరపతి, ఆ మాటలువిని, రాజకుమారుని సమ్మతితో 'ఏదీ? ఎక్కడ? ఆమెను మా ఎదుటికి తీసుకురా'. అని వుత్తరువు చేశాడు. సేనాపతి ఆమెను పిలుచుకొనివచ్చి ఎదుట నిలిపాడు.

సేనాని వెంట వస్తున్న సౌందర్యసుధానిధిని తన ప్రియురాలని రాజపుత్రుడు గ్రహించి వెంటనే విరహం భరించలేక మూర్ఛపోయాడు. మందారవతికూడ ఎదుట తన ప్రియతముణ్ని చూచి వెంటనే శోకహర్షాలు పెల్లుబకగా క్షణంసేపు కళ్లప్పగించి నిలబడి పోయింది.

వింధ్యకేతువు వర్తక శ్రేష్ఠుని బెదిరించాడు నిజంచెప్పమని. దుష్టచేష్టితుడయిన వణిక్పతి ఇలా అన్నాడు: 'ఇంతవరకు చేసిన పాపానికి తగిన ఫలం అనుభవిస్తున్నాను. ఈ రాజకుమారుణ్ని వంచించాను. రాజకుమారిని అపహరించాను దీనికి పరిహారంగా వీరిద్దరికీ వైభవోపేతంగా నా భవనంలో వివాహం చేద్దామని నిశ్చయించాను. మీ వారు నన్ను అడవిలో పట్టుకొన్నారు. పరద్రోహ పరాయణులకు సుఖం ఎక్కడ లభిస్తుంది?'

వింధ్యకేతువు వర్తకుని మాటలు వినలేదు. 'ఈ దుర్మతిని చంపివేయండి' అని భయంకరంగా బొమముడి వేసుకొని తన సేనాపతికి ఉత్తరువు చేశాడు. రాజపుత్రుడు అడ్డువచ్చి, 'వద్దు, వద్దు. వర్తకుణ్ని చంపవద్దు. వర్తకులకు ధనం ప్రాణం, శరీరం తృణ సమానం. కనుక ధనంమాత్రం తీసుకొని వర్తకుణ్నికట్టుబట్టలతో వదలండి' అన్నాడు.

కరుణానిధి అయిన సుందరసేనుని వల్ల వర్తకుని ప్రాణాలు దక్కాయి. పుళిందులు అతనిని కట్టుగుడ్డలు కూడా ఒలిచి పంపివేశారు. కుక్కలు మొరుగుతుండగా, వర్తకుడు వెళ్లిపోయాడు.

కొంతకాలం తర్వాత వింధ్యకేతువు మహాసేన మహారాజుకు తనయుడు దొరికాడనే అమృతంతో నిండిన వర్తమానం పంపాడు. శబరాధిపతి లేఖ్యంవల్ల నిషధాధిపతి తన కుమారుని వృత్తాంతం తెలుసుకొని తన వియ్యంకుడయిన హంసద్వీపాధిపతితోను, మహామాత్య భృత్యులతోను, పెద్ద సైన్య పరివారంతోను వింధ్యకేతువు పల్లెకు బయలుదేరాడు.

## రంగుల రాట్నం

# బద్దె పురుగు






బద్దె అనే దానికన్నా టేప్ అంటేనే అందరికి తెలుస్తుందేమో. టేప్ అనేది కొలవడానికి ఉపయోగపడే సాధనం. ఆ ఆకారంలో ఉండే పురుగు అది. శాస్త్రీయంగా దీన్ని టేనియాసోలియం అంటారు. పందికీ, మనకి కూడా సంబంధం కల్గిన పరాన్న జీవి ఇది. పంది కండరాల్లోను, మన పేగుల్లోనూ ఉండేది. అంతేకాదు. పంది నుంచి మనకి, మన నుంచి పందికి వ్యాపిస్తుంది. పంది మాంసం తినకపోతే ఇది మనకు సంక్రమించదన్నమాట.

టేనియాసోలియం సాధారణంగా 6—10 అడుగుల పొడవుంటుంది. దానిలో సుమారు వెయ్యి 'ఖండితాలుంటాయి. దాని 'తల' మాత్రం గుండుసూది ప్రమాణంలో ఉంటుంది. నోరులేదు కాని కొక్కేలు, అంటు బిళ్లలు ఉండటంవల్ల వాటితోటే మన పేగు గోడల్లో దాల్చి అతుక్కొని ఉంటుంది. వెనక శరీరం అంతా కొన్ని మెలికలు తిరిగి పేగుల్లో వుంటుంది. మనం తిన్న ఆహారం నుంచే తన ఆహారాన్ని, శరీరం గోడల్లోంచి పీల్చుకొంటుంది. నోరులేదు కనక| దానికి జీర్ణనాళం కూడా ఉండదు. సుఖమైన జీవనానికి అలవాటు పడ్డాది కాబట్టి అన్ని రకాల అవయవాల మండలాలు చాల వరకు క్షీణించిపోయాయి. కళ్లు మొదలైన స్పర్శావయవాలు లేవు. ప్రత్యుత్పత్తి మండలం మాత్రం విపరీతంగా ఎదిగివుంటుంది.

దాని శరీర ఖండితాలన్నీ ఒకేలాగా, ఒకే దశలో ఎదిగి ఉండవు. తల వెనకే 'మెడ' అనే భాగం, దాని వెనక అస్పష్టంగా అడ్డు గీతలుంటాయి. పోను పోను ఈ గీతలు స్పష్టమయి, ఖండితాలు పెద్దవిగా అవతాయి. మొదట వాటిలో పురుష జననేంద్రియ మండలం ఆతరవాత 'తరవాత స్త్రీ జననేంద్రియ మండలం ఎదుగుతాయి. అంటే ప్రతిఒక్క ఖండితంలోనూ మొత్తంమీద ఈ రెండూ ఎదుగుతాయన్నమాట. మెలికల తిరిగి ఉండడం వల్ల ఒకే జీవి ఖండితాల మధ్యనే సంపర్కం జరిగి గుడ్లు ఏర్పడతాయి. గర్భాశయం విపరీతంగా ఎదిగి దాని ప్రభావానికి మిగతా అవయవాలు క్షీణించి పోతాయి. గర్భాశయం చెట్టు లాగా శాఖలతో వ్యాపిస్తుంది. చివరి ఖండితాల్లో గుడ్లు తప్ప మరింకేవీ ఉండవన్నమాట.

ఇలాటి ఖండితాలు ఒక్కొక్కటి వెనక నించి విడిపోతాయి. మానవ మలం ద్వారా బయటకు వస్తాయి. పంది ఈ మలాన్ని [అంటే ఈ గుడ్లని] తినే అవకాశం కల్గితే, అవి దాని శరీరంలో చిత్రమైన ఆకారం కల్గిన రూపంలో బయటపడతాయి. వాటికి ఆరు కొక్కేలు వుంటాయి. వాటి సహాయంతో దాని రక్తమండలంలో ప్రవేశించి కండరాల్లోకి చేరతాయి. అక్కడ స్థిరంగా ఉంటాయి. దీని మాంసాన్ని సరిగా ఉడక పెట్టకుండా తింటే వాళ్ళ కడుపులో అది బద్దె రూపం దాల్చి, జీర్ణనాళంలో స్థిరపడి క్రమంగా ఖండితాలని ఏర్పరచుకొంటుంది.

బద్దె పురుగుల్లో చాలా జాతులుంటాయి: కొన్నిటికి కుక్కలు, కొన్నిటికి ఆవులు, మరి కొన్నిటికి చేపలు ఇలా పోషక జీవులు ఉంటాయి. వాటికి తగిన విధంగా రెండో పోషక జీవి కూడా ఉంటుంది.

## ...బృహత్కథామంజరి

అతని సైన్యంలోని ఏనుగుల బలం వెళ్లుతుండగా, ప్రళయకాల కాల మేఘాలు భూమిమీదికి దిగివచ్చాయా అని పించింది.

సుందరసేనుడు తన మిత్రులతోను, ప్రియురాలితోను మహాసేనుడికి ఎదురు వచ్చి, అశ్రుపూరిత నయనాలతో తండ్రికి నమస్కరించాడు. తర్వాత అందరూ అలకాపురికి తిరిగి వచ్చారు. అలకాపురి ఆనందకోలాహలంతో కన్నుల పండుగగా వుంది.

శుభముహూర్తంలో మందారవతికీ, సుందరసేనునికి వివాహమంగళం త్వరలో జరిగింది. ఉత్సవాలు చాలాకాలం జరిగాయి. హంసద్వీపాధిపతి ఆనందామృతంలో తేలికిసలాడుతూ తన కుమార్తెను వాత్సల్యంతో పదే పదే కౌగిలించుకొన్నాడు. కొంతకాలం తర్వాత సపరివారంగా హంసద్వీపానికి వెళ్లిపోయాడు.

'ఇలా సుందరసేనుడు చిరకాలానికి తన మిత్రులను, నేత్రామృత తరంగిణి అయిన ప్రియురాలిని కలుసుకొన్నాడు. ఇలా విధాత విలాస కుటిలమయిన గతి అద్భుతమయింది. మీ సంకల్పం కూడా ఫలిస్తుంది. సంశయం లేదు' — అని కణ్వమహర్షి దయతో చెప్పిన కథను విని మాకు ధైర్యం కలిగింది.' అని వ్యాఘ్రసేనుడు తమ పూర్వవృత్తాంతాన్ని చెప్పి, తర్వాతి కథ కొనసాగించాడు.

'తర్వాత 'మేము మునీంద్రుని వద్ద సెలవు పుచ్చుకొని, ఘోరమయిన ఈ అడవి చేరాము. చాలసార్లు ఉపవాసం చేసి బాధపడినవాళ్లం గనుక ఆత్రంగా ఈ చెట్టు పండ్లు తిన్నాము. షండల్లో పండమైపోయాము. నీ దర్శనంవల్ల శాపవిమోచనం పొందాము. ఎలాటి వ్యాధులూ లేక నిరామయుడుగా వున్న నిన్ను చూచాము.'

మృగాంకదత్తుడు వ్యాఘ్రసేనుడు చెప్పిన సంగతులు విని ఆశ్చర్యపడి, హేరంబవృక్షానికి నమస్కరించాడు, తన పదుగురు మిత్రులతోను ఉజ్జయినికి బయలుదేరాడు.

(ఇంకా ఉంది)



# ఫొటోగ్రఫీలో వినోదం కోసం
# అగ్ఫా క్లిక్ III

అభ్యాసానికి, అనుదిన వినియోగానికి అత్యుత్తమం

- ఉపయోగించుట తేలిక. ఎడ్జెస్ట్‌మెంట్లు అవసరం లేదు.
- ప్రతి 120 రోలుతో, 12 పెద్ద సైజు (6 x 6 సెమీ) చిత్రాలు తీయవచ్చు.
- ఎవర్-రెడీ కేస్, పోర్ట్రెయిట్ లెన్సు, మరియు ఫ్లాష్ గన్ అదనపు వెలకు లభిస్తాయి.

కన్నులు మిరుమిట్లు గొలిపే ప్రింట్లు, ఎన్‌లార్జిమెంట్లు కావాలంటే,
అగ్ఫా ఫొటో పేపరే వాడండి.



రు. 46.50 (పన్నులు అదనం)

అధరైజ్డ్ అగ్ఫా డీలర్ల అందరివద్ద లభిస్తాయి.
అగ్ఫా గెవార్ట్ సహకారంతో, తయారు చేయువారు:
ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లి., బరోడా



సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
అగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
బొంబాయి . క్రొత్త ఢిల్లీ . కలకత్తా . మద్రాసు





® ఫొటోగ్రఫిక్ ఉత్పత్తుల నిర్మాతలు, అగ్ఫా-గెవార్ట్ ఆంట్‌వెర్ప్-లివెర్కుసెన్ యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్.

అగ్ఫా క్లిక్ — భారతదేశంలో విస్తార ప్రచారణ కలిగినది.

MAG-139-...R Tel

## కొత్త నటి

# ఉషానందిని

ఇంటర్వ్యూ : మోహన్‌కుమార్

ఫొటోలు : ప్రభాకర్



పూవుతో పోటీపడే ముఖారవిందం

'డిగ్రీ కోర్సు పూర్తి చేసి ఏదేనా ఉద్యోగం చెయ్యాలనుకున్నాను. కాని, అనుకోకుండా సినిమాతారనయ్యాను. తమాషాగా ఉందికదూ?' అన్నదా అమ్మాయి ఎంతో ఉషారుగా, కళ్ళు చక్రాల్లా గుండ్రంగా తిప్పుతూ.

'తమాషా కాదు; అదృష్టం!' అన్నాను.

'అవును, మీరే కరెక్టు' అంటూ నావేపు చురుకుగా చూసింది. ఆ కళ్ళలో ఏదో మత్తు. ఆమె చూపుల్లో ఏదో గమ్మత్తు, ఆ నవ్వులో తెలిని ఆకర్షణ. అదే ఆమె ప్రత్యేకత!

### కేరళ ఖ్యాతి...

అందగత్తెలకు ఆలవాలమైన కేరళలో జన్మించిన యీ అమ్మాయి పేరు ఉషానందిని. త్రివేండ్రం యూనివర్శిటీ



పండులాంటి పరువం...

కాలేజీ నుంచి బి. ఏ. రెండవ సంవత్సరం పరీక్షలు రాసి, సరాసరి సినిమాలకి వచ్చింది ఉష. ఆమె రావాలనుకుని రాలేదు. తార కావాలనుకుని అవలేదు.

అందచందాలు, మంచి ఒడ్డూ పొడుగూ, చక్కని శరీర సౌష్టవం కలిగిన కుమారి ఉష 1951 మే 10న త్రివేండ్రంలో జన్మించింది. ఆమెకు చిన్నప్పట్నుంచి లలిత కళల మీద ఆసక్తి ఎక్కువ. అలాగని చదువులో కూడా తక్కువేమీ కాదు. ఎంతో శ్రద్ధగా చదువుకుంటూ అన్నింటా మొదటగా వచ్చేది.

### అనుకోని అవకాశం

ఫస్టు బి. ఏ. అయింతర్వాత ఉష కుటుంబానికి అత్యంత ఆప్తులయిన శ్రీ పరమేశ్వరన్ నాయర్ ఒకరోజు వాళ్ళింటికి వచ్చారు. ఆయన ప్రసిద్ధ చిత్ర నిర్మాత. 'అమ్మాయిలో ఒక మంచి తార కావలసి ఫీచర్స్ ఉన్నాయి. సినిమాల్లో చేర్పిస్తే బాగా పైకి వస్తుంది. ఏమంటారు?' అంటూ ఉష తల్లిదండ్రుల్ని కదిపారాయన. అందుకు వారు సమ్మతించలేదు. అలాంటి ఉద్దేశం ఉషకుగాని, ఆమె తల్లిదండ్రులకు గాని ఏనాడూ లేదు—చదువు పూర్తి అయ్యాక ఉద్యోగం చేయాలనే తలంపు తప్ప...

ఇది జరిగిన ఏడాదికి మరో నలుగురయిదుగురు నిర్మాతలు వచ్చి అడిగి వెళ్ళారు. ఎవరికీ ఏమాటా ఇవ్వలేదు. తర్వాత మరో వారానికి మళ్ళా పరమేశ్వరన్ వచ్చారు — తనిప్పుడు తీసే చిత్రంలో చక్కని వేషం ఉన్నదనీ, ఉష ఆ పాత్ర వేస్తే తప్పకుండా పైకి వస్తుందనీ చెప్పారు. ఉష అప్పుడు ఆలోచనలో పడ్డది. తనలోనూ ప్రతిభ వుందేమో! లేకపోతె యింతమందీ వచ్చి తననీ సినిమాలలోకి ఎందుకు తీసుకుంటానంటారూ? 'నాలోనూ ఆశ మొలకెత్తింది. అనుకోని యీ అవకాశాన్ని అంగీకరించాను. అలా నా సినిమారంగ ప్రవేశం— 'నగరమేనన్ని' చిత్రం ద్వారా జరిగింది. విన్సెంట్ ఆ చిత్రదర్శకులు' అన్నది ఉష.

### మరపురాని అనుభూతి!

'నగరమేనన్ని చిత్రంలో నటించడానికి మద్రాసు వస్తున్నప్పుడు నాకు సెండాఫ్ యివ్వడం కోసమని నా క్లాస్‌మేట్స్ చాలామంది స్టేషన్‌కు వచ్చారు. నన్ను సినిమాల్లో బాగా నటించమని, పేరు

[illegible] వైక కోరాలని కోరారు. హృదయపూర్వకంగా ఆశీర్వదించారు. వాళ్లను విడిచి ట్రైను కదిలిపోతున్నప్పుడు నా కన్నులు కరిగాయి. దుఃఖంతో గొంతు పూడిపోయింది. వాళ్ల స్నేహానికి, ఆప్యాయతకీ దూరమైపోతున్నాననే బాధ ఒకవైపూ, వాళ్ల కోరికను సక్రమంగా నెరవేర్చగలనా అనే తపన మరోవైపూ నన్నాక్షణాన చుట్టుముట్టినపుడు కలిగిన తీయని వేదన అది. మరపురాని అనుభూతి. అది నా జీవితంలో మరపురానిది' అన్నది ఉషానందిని గంభీరంగా, వాటి స్మృతుల్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ.

చదువుతోపాటు చక్కని సంస్కారాన్ని అలవరచుకొన్న కుమారి ఉషానందినిలో అణకువ, మాట మెత్తదనం, మంచితనం మూర్తీభవించి ఉన్నవి. ప్రస్తుతం ప్రసిద్ధ రచయిత, దర్శకుడు శ్రీ కె.ఎస్. గోపాలకృష్ణ నిర్మిస్తున్న ఒక తమిళ చిత్రంలో ముఖ్యభూమిక పోషిస్తున్నది అమ్మాయి. తీరిక వేళల్లో పుస్తకాలు చదువుకోవడం, పెయింటింగ్ వేయటం ఈమె హాబీలు.

'తెలుగు బాగా నేర్చుకుంటున్నాను. తెలుగు చిత్రాల్లో కూడా నటించాలని ఉంది. తెలుగు చిత్రనిర్మాతలు నన్ను ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను' అంటూ తన ఆశాభావాన్ని వ్యక్తపరచింది ఉష.



శాంతమైన సొంపులు...

కథానాయికల కొరత ఎక్కువగా కనిపిస్తున్న ఈ తరుణంలో కొత్త తారల్ని — ముఖ్యంగా ఉషానందినిలాంటి ప్రతిభగల వారిని ప్రోత్సహించడం [illegible]

[illegible] ●



'బాలరాజు కథ'లో బేబి సుమతి, మాస్టర్ ప్రభాకర్

చిత్రసమీక్ష.

# బాలరాజు కథ

బొమ్మలు వెయ్యడంలో బాపు ఒక రికార్డును స్థాపించారు. ఇప్పుడు బొమ్మలు తియ్యడంలో కూడా తమ ప్రత్యేకతని నిలబెట్టుకుంటున్నారని చెప్పడానికి ఆయన దర్శకత్వంలో విడుదల అవుతున్న ఇటీవలి చిత్రాలే నిదర్శనం!

ఏడు శిలామూర్తాలు సీరియల్ ఆర్డర్‌లో ఒకబాలుని జీవితానుభవాలుగా రూపొందడం లక్ష్మీ ఎంటర్‌ప్రైజెస్ వారి 'బాలరాజు కథ' కథావస్తువు. కథావస్తువు, కథాస్థలం తెలుగువారివి కాకపోయినా — తెలుగువారిని మెప్పించే విధంగా చిత్రీకరించడంలోనే వుంది బాపు ప్రతిభ!

[illegible]

వాలుగా ఈ చిత్రంలో ప్రత్యక్షమవుతాయి. వినోదం, విజ్ఞానం, సెంటిమెంటూ కొల్లలుగా వున్న ఈ కథలు విసుగెత్తిపోయిన ప్రేక్షకులకి గొప్ప రిలీఫ్ నిస్తాయి.

మాస్టర్ ప్రభాకర్ ఉత్సాహముగా మంచి భవిష్యత్తు వున్న బాల నటుడు. కంఠం ఎరువు తెచ్చుకోకుండా వుంటే అతని నటన మరింతగా భాసించేవుండేది. పాత్రకి పనిగండం వున్నప్పటికీ, నాగభూషణం నటనలో ఆ లోపం కనిపించదు! వినోద భరితమైన ఇతర ముఖ్య పాత్రలని సూర్యకాంతం, సాక్షి రంగారావు, అల్లు రామలింగయ్య, రామచంద్రరావు, [illegible]

జయుత్సరి. సెప్టెంబర్ 30 కి మద్రాసు చేరుకోగలను' శ్రీ రాజేంద్రప్రసాద్ చెప్పారు. ఈ డెలిగేషన్‌లో అయిదుగురు సభ్యులున్నారట. అందులో ఒకరు మన రాజేంద్రప్రసాద్ గారు



'ప్రతీ రాజు'లో విజయశ్రీ

## నా తమ్ముడు

'దండాలు, దండాలండి గురువుగారు— మీకు దక్షిణ యివ్వ వచ్చే శిష్యురాలు' —అనే చక్కని ప్రేమ గీతాన్ని ఆచార్య ఆత్రేయ రాయగా శ్రీమతి పి. సుశీల వివ్ బి ఆర్. పిక్చర్స్ వారి 'నా తమ్ముడు' చిత్రం కోసం పెండ్యాల సంగీత సారథ్యంలో పాడారు. ఈ పాటను భారతి, శోభన్‌బాబుల మీద తిరువాన్మియూర్ బీచ్ లోను, కోవలం బీచ్‌లోను చిత్రీకరించారు. అప్పలాచార్య రాసిన మరొక హాస్య యుగళం 'సరిగమ పదనిస— సంతోషమై పోయెరా' పాటను యస్. పి. బాలసుబ్రమణ్యం, వసంత పాడారు. ఇన్‌డోర్‌లో సెట్ వేసి ఈ గీతాన్ని రాజబాబు, ప్రసన్నరాణి లపై చిత్రీకరణ జరిపారు.

ఇంతవరకు పది రీళ్ళు పూర్తయిన ఈ చిత్రంలో జగ్గయ్య, శోభన్‌బాబు, భారతి, రాజబాబు, నాగభూషణం, చంద్రమోహన్, మణిమాల, ప్రసన్నరాణి, ఛాయాదేవి, నిర్మల, బేబీ శ్రీదేవి, అల్లు రామలింగయ్య ముఖ్య పాత్రధారులు. రచన: ఆచార్య ఆత్రేయ, సంగీతం: పెండ్యాల, కళ: రాజేంద్రకుమార్, నృత్యాలు: చిన్ని — సంపత్, పసుమర్తి కృష్ణమూర్తి; ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ జి. వి. కృష్ణారావు, కెమెరా: ఎం కె. రాజు, కూర్పు: బి. గోపాలరావు, దర్శకత్వం: కె. యస్. ప్రకాశరావు, నిర్మాత: మూరపు భాస్కరరావు, సమర్పణ: వై. కన్నయ్య. ఆంధ్రప్రదేశ్‌లో యీ చిత్రం పూర్ణా పిక్చర్స్ ద్వారా విడుదల అవుతుంది.

## సినిమా డైరీ

● ప్రొడ్యూసర్స్ కంబైన్స్ వారి కలర్ చిత్రం 'ఇద్దరమ్మాయిలు' అక్టోబరు 2వ విడుదలవుతుంది. ఈ చిత్రానికి ఎస్. ఆర్ పుట్టన్న దర్శకుడు

● వి. ఎస్ ఆర్. పిక్చర్స్ నిర్మించిన 'సుగుణ సుందరి కథ' సెప్టెంబరు 11కి విడుదలయింది. ఈ చిత్రానికి హెచ్. ఎస్ వేణు దర్శకుడు

● శ్రీకాంత్ అండ్ శ్రీకాంత్ ప్రొడక్షన్స్ వారి 'మారిన మనిషి' సెప్టెంబరు 24న విడుదలవుతుంది. ఈ చిత్రానికి సి. ఎస్. రావు నిర్దేశకుడు.

● ఎస్. వి. ఎస్. పిక్చర్స్ వారి 'నిండు దంపతులు' షూటింగు సెప్టెంబరు 5వ ప్రారంభమైంది. ఈ చిత్రానికి కె. విశ్వనాథ్ నిర్దేశకుడు

● శ్రీ సరస్వతీచిత్ర 'కథానాయకురాలు' చిత్రానికి సంగీత దర్శకుడు ఎ. ఎ. రాజా సర్మ వేక్షణలో ఎల్. ఆర్. ఈశ్వరి పాడిన పాటను జెమినీలో రికార్డు చేశారు. ఈ చిత్రానికి నిర్మాతలు శ్రీ గిడుతూరి సూర్యం, వల్లా వెంకట్రావు. కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వం శ్రీ గిడుతూరి సూర్యం.

## ఇద్దరమ్మాయిలులోని విశేషాంశం

'ఇద్దరమ్మాయిలు' నిర్మాతల్లో ఒకరయిన జి. ఎస్. మణి ప్రారంభోత్సవంకి రండి అని పిలిచారు. వెళ్ళాను. చిత్రం ప్రారంభం నుండి చివరివరకు



'దేశమంటే మనుషులోయ్'లో శ్రీదేవి, నాగయ్య

## వివాహం

శ్రీ పేకేటి శివరావ్ కుమారుడు చి. కృష్ణమోహన్‌కి గుంటూరు వాస్తవ్యులు శ్రీ పూసపాటి శివరామయ్యగారి కుమార్తె చి. సౌ. రాజ్యలక్ష్మికి తిరుమలలో వైభవంగా వివాహం జరిగింది. వివాహానికి, మద్రాసు హొటెల్ అశోకాలో ఏర్పాటుచేసిన రిసెప్షన్‌కి పుర ప్రముఖులు, సినిమా పరిశ్రమకి చెందినవారు అనేకులు వచ్చి వధూవరులను ఆశీర్వదించారు.

—పి. వి ●

# మన దేశంలో చలనచిత్ర పరిశ్రమ పరిస్థితి ఇదీ!

బొంబాయినుంచి వెలువడే ఆర్థిక దినపత్రిక 'ఎకనమిక్ టైమ్స్' అఖిలభారత చలనచిత్ర పరిశ్రమమీద కొన్ని ముఖ్యమయిన లెక్కల్ని సేకరించి, ప్రచురించింది.

భారత దేశానికి ప్రపంచ చలనచిత్రాల నిర్మాణంలో ప్రథమస్థానం వచ్చింది. సంవత్సరానికి 320 చిత్రాలు మన దేశంలో తయారవుతున్నాయి. ఆ 320 చిత్రాలు 58 స్టూడియోలలో నిర్మించబడుతూ 37 లాబరేటరీస్‌లో ప్రాసెస్ అవుతున్నాయి. ఈ చిత్రాలను నిర్మించే సంస్థలు 1800 ఉన్నాయనీ, వీటికి ఆర్థిక సదుపాయం కలిగించే పంపిణీ సంస్థలు 1200 కలవనీ— దేశంలో గల మొత్తం థియేటర్లు 5600 అనీ — ఈ చిత్రాలమీద సాలీనా రూ. 120 కోట్లు ఆదాయం వస్తున్నదనీ, అందులో 40 శాతం వినోదపు పన్ను, ప్రదర్శన పన్నుల కింద ప్రభుత్వానికి పోతున్నదనీ ఆ పత్రిక పేర్కొన్నది.

మరో రెండు ముఖ్యమయిన అంశాలుకూడా అందులో ప్రచురితమైనాయి. ఒకటి: ఒక ఆర్టిస్టుకి ఒక చిత్రానికి రూ. 17 లక్షలు యివ్వగలుగుతున్న నిర్మాత — పనివాళ్లకి ఒక చిత్రానికి నెలకి రూ. 50 లు జీతం యిస్తున్నాడు. ఎక్కువ శ్రమించేవారికే తక్కువ జీతం. రెండు: తారలకి లక్షలకు లక్షలు కుమ్మరించడానికి సిద్ధపడే నిర్మాత—తన చిత్రానికి స్క్రీన్‌ప్లే రాసిన రచయితకుగానీ, సంభాషణల రచయితకిగాని ఎంత కష్టపడ్డా రెండువేల రూపాయలు యివ్వటానికి యిష్టపడడు.

* * *

ఇది అఖిలభారత చలనచిత్ర పరిశ్రమ సంగతి. మన పరిశ్రమనుతీసుకుని సుమారుగా అంచనావేస్తే ఏటా 80 చిత్రాలు తయారవుతున్నాయి; ఆ చిత్రాల మీద దాదాపు ఆదాయం సాలీనా రు. 8కోట్ల నుండి రూ. 10కోట్ల వరకు ఉండవచ్చును. సుమారు 600 థియేటర్లు మనకి ఉన్నాయి. 18 స్టూడియోలలో తయారయ్యే యీ 80 చిత్రాలూ



9 లేబరేటరీస్‌లో ప్రాసెస్ అవుతాయి.

ఇటీవలి సంవత్సరాలలో చిత్రాల నిర్మాణపు విలువలు పెరిగాయి. ఇదివరలో అయితే పెద్ద తారలున్న చిత్రానికి రూ. 7లక్షలు, బడ్జెట్ చిత్రానికి 4లక్షలు అయ్యేది. ఇప్పుడు పెద్ద చిత్రానికి 8లక్షలూ, చిన్న చిత్రానికి 5లక్షల చిల్లరా అవుతోంది.

ఆర్టిస్టుల ధరలుకూడా పెరిగాయి. బొంబాయిలో పెద్ద ఆర్టిస్టు రూ. 17 లక్షలు తీసుకొంటూంటే మన పెద్ద ఆర్టిస్టులు రూ. 2 లక్షలు తీసుకొంటున్నారు. బ్లాక్ మనీ అనేది ఓపెన్ సీక్రెట్. ఈ మొత్తాలను నిర్మాత మరొక విధంగా సర్దుకోవటం ఆనవాయితీగా వస్తున్నది.

'ఎకనమిక్ టైమ్స్' పత్రిక పేర్కొన్నట్లు — సంభాషణల రచయితకి రెండువేలు ఎక్కడ యిస్తున్నారో తెలీదు గాని, మన పరిశ్రమలో దానికి రెండురెట్లు అదనంగానే యిస్తున్నారు. మరి కొందరు పెద్దవాళ్లకి ఇంకా ఎక్కువ మొత్తాలను సమర్పిస్తున్నారు.

ఇక వర్కర్ల సంగతికి వస్తే— వాళ్లస్థితి అన్నిచోట్లా ఒకేలా వున్నది. సినిమాలలో పనిచేసే వాళ్లకి ఒక స్థిరమైన ఏర్పాటు ఉండదు. ఆ పని ఎన్నాళ్లు హామీగా ఉంటుందో కూడా తెలీదు. వాళ్ల జీవితాలకి భరోసాలేదు, పెద్ద నటీనటులకి, ముఖ్య సాంకేతిక నిపుణులకి ఉన్న 'గట్టి' వసతులు, ఆదాయం వారికి లేవు. పిల్లపాపల్ని పోషించుకుంటూ ఆనందంగా జీవించగలిగే హక్కు — సినిమా వర్కర్లకు ఇంకా కలుగజెయ్యలేదు పరిశ్రమ.

* * *

పై లెక్కలని చూస్తే భారత దేశంలో మొత్తం చలనచిత్ర పరిశ్రమ ఇండియా టొబాకో కంపెనీకన్నా, టాటా అయిరన్ ఎండ్ స్టీల్ కంపెనీకన్నా చిన్నదని తెలుస్తోంది! ఈ కంపెనీలలో అతి చిన్న ఉద్యోగికి కూడా నెలకి కొన్ని వందల రూపాయల జీతం ఉంటుంది. ఇతర సౌకర్యాలు, సంరక్షణలు చాలా ఉంటాయి.

—మోహన్‌కుమార్ ●

## [illegible]

[శతకద్వయము] కర్తలు: శ్రీ వజ్ఝల బుచ్చికవి, శ్రీ వెంకటేశ్వర్లు, డెమ్మీ 24+47 పుటలు. వెల 2 రూ. ప్రాప్తిస్థానం— శ్రీ వజ్ఝల వేంకటేశ్వర్లు కేరాఫ్ శ్రీ వి. యస్. రావు, డిప్యూటీ చీఫ్ ఇంజనీరు,[ఆర్.ఇ] ఎస్.ఇ. రైల్వే. విశాఖపట్నం—4.

ఇందులో రెండు శతకాలున్నవి. అవి పితా పుత్రులవి. రఘువంశభూషణ శతకకర్త— తండ్రి బుచ్చికవి. ప్రభు శతకకర్త — కుమారుడు వేంకటేశ్వర కవి. రెండూ వృత్త శతకాలే! అముద్రితంగా ఉన్న తండ్రి శతకాన్ని ముద్రింపించి— ఆయన కీర్తిని వ్యాపింపజేస్తూ ద్వితీయ శతకకర్త పితృఋణం తీర్చుకున్నాడు. ఇదివరకే పెక్కు కృతులు రచించి బహుమతులూ, సమ్మానాలూ పొందిన ఆ కుమారుడు తన కీర్తిని యీ కృతిలో ఇంకా విస్తరింపజేశాడు.

రెండూ ఒకదానికొకటి యీడై 'ఆత్మా వై పుత్రనామాసి' అనిపిస్తున్నవి. పుత్రుడు ఈ యుగానికి—అంటే కాలానికి చెందిన వాడగుటవల్ల—అతని కవితలో కొంత నవ్యత కానరావడం సహజం. అయినా —వేంకటేశ్వర కవిగారు ప్రాచీన లక్షణాలను పాటిస్తూనే, కల్పనలలోనూ, రచనలోనూ నూతనత్వాన్ని వెలయించారు. అందువల్ల ఉభయ సంప్రదాయాల వారికీ వారి రచన ఉపాదేయమై ఉంటుంది.

శతక ద్వయంలోని రచన ఎంతో రసవంతంగా ఉన్నది. మచ్చునకు శ్రీ బుచ్చికవి రచన—

'దేహము గాలిలో నిడిన
దీపము, పుట్టుక నీటిబుగ్గ, సం
దేహము చిత్తవృత్తియని
నేను నెరింగియు నీదు మాయచే
మోహామెదిర్చి జ్ఞానబల
మున్ గ్రుశియింపగ జేయుమయ్యో! త
ద్దోహదమైన భక్తిదయ
తో నిడుమా రఘువంశ భూషణా!

శ్రీ వేంకటేశ్వరకవి రచన—

'జననంబున్ మరణంబు నాపయి పున
ర్జన్మంబుగా ఆత్మ యీ
తనువున్ మార్చుకొనున్ నిరంతర చల
త్సంసార చక్రాన, న
జ్జనుడీ సత్యమెరింగి అస్థిరములన్
సంగంబు వర్జించి ధ్యా
నినిమగ్నుండయి నిన్ను గొల్చి పరమా
నందంబు నొందున్ ప్రభూ!

దీని పీఠికలో శ్రీ వేంకటేశ్వర్లుగారు వజ్ఝల వంశం వారిని గురించిన విశేషాలు వివరించారు. వీరిది విద్వత్కుటుంబం. కళా ప్రపూర్ణ—వైయాకరణ కేసరి శ్రీ సీతారామ శాస్త్రిగారిని గురించే తెలుగు వారికి తెలుసును. సీతారామాంజనేయ వ్యాఖ్యకర్త శ్రీ నారాయణశాస్త్రిని గూర్చి దాన్ని చదివిన వారికి మాత్రం తెలుసును. ఈ కుటుంబంలోని విద్వత్కవు లందరినీ గురించి వివరాలివ్వడం ఆంధ్రావని కెంతో ఉపయోగం. కవులు తమ కుటుంబంలోని విద్వత్కవులను గురించి తెలిపితే చరిత్రకు దోహదమిచ్చి [illegible] పద్ధతి కిందులోని పీఠిక ఆదర్శం! [illegible] ఆంధ్రులందరి ఆదరానికి పాత్రం కాగలదని నా విశ్వాసం.

# పుస్తకాలు

## శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము

ఆంధ్రానువాదం. అనువాదకర్త: శ్రీ తాతపూడి రామానందమోహనరావు, పాకెట్ సైజు 70 పేజీలు. వెల 50 పైసలు. ప్రతులకు టి. ఆర్. మోహనరావు, గార్డెన్ హవుస్, గౌతమీ నగర్, కొవ్వూరు, పడమటి గోదావరి జిల్లా.

సుప్రభాతాన్ని గురించి ఎరగని వారుండరు. దాని అనువాదాలెన్నెన్నో. అందులో ఇది ఒకటి. ఇందులో సుప్రభాతంతో పాటు శ్రీ వేంకటేశ్వర స్తోత్రం, శ్రీ వేంకటేశ ప్రపత్తి, మంగళాశాసనమూ కూడా ఉన్నవి. అనువాదం సరళంగా ఉన్నది. దీన్ని రచయిత మామయ్య శ్రీ వేదుల సత్యనారాయణసూరిగారు పలుసార్లు సవరించుచు చక్కని రూపు రేఖలు తీర్చారు! తొలి రచన అయినా అనువాదం సున్నితంగా సాగిపోయింది. దీనిపైని శ్రీ జటావల్లభుల వారు, కే. వేం. స. అప్పారావుగారు, అల్లంరాజు— సూర్యనారాయణమూర్తిగారు— మున్నగు పెద్దలు చక్కని అభిప్రాయాలిచ్చారు. అనువాదంతో మూలం కూడా ముద్రించబడింది. మూలాభిప్రాయం అనువాదంలో చక్కగా వ్యక్తమవుతున్నది

మూలం—

శ్లో. ఈ షత్ప్రఫుల్ల సరసీరుహ నారికేళ
పూగద్రుమాది సుమనోహరపాళికా నామ్
ఆవాతి మందమనిల: సహదివ్య గంధై
శేషాద్రిశేఖర విభో తవ సుప్రభాతమ్!

అనువాదం—

గీ. పూగపున్నాగ కేతకీ పుష్ప దివ్య,
పరిమళాయాత దక్షిణ పవనుఁ డిపుడ
మందమందంబుగను వీచు డెందమలర,
సుప్రభాతమ్ము శేషాద్రిసుఖనివాస.

భక్తులు చదవదగిన గ్రంథం యిది!

## భగవద్గీత

శ్రీ పిరాట్ల లక్ష్మణమూర్తిగారి తాత్పర్యముతో. పాకెట్ సైజు 375 పేజీలు. వెల రూ. 2. ప్రతులకు—శ్రీ పిరాట్ల భానుమూర్తి, గీతాకుటీర్, పిఠాపురం, తూ. గో. జిల్లా.

భగవద్గీతకు అత్యంత విపులాలూ, సుదీర్ఘాలూ, దీర్ఘాలూ, హ్రస్వాలూ అయిన తాత్పర్యాలు తెలుగులో శతాధిక సంఖ్యలో ఉన్నాయి. కొంత వ్రాసే శక్తి ఉత్సాహమూ ఉండి, భగవద్గీతోపన్యాసం వింటే రచన తయారు కావచ్చును. శ్రీ లక్ష్మణమూర్తిగారు 'మహోపాధ్యాయ, బాలవ్యాస, బ్రహ్మశ్రీ వారణాశి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గీతా ప్రవచనమును' విని యీ రచనకు పూనుకున్నారు. దీనిపైని "వేర్వేరు భాషలలో భిన్నభిన్న భావములతో, ఎన్నో వ్యాఖ్యానములు, సాంప్రదాయములు, కాలానుగుణముగా గీతపై ప్రకటింపబడుచు వచ్చినవి. అవన్నియు విస్పష్టపాతముగ ప్రకటింపబడినట్లు తోచదు' అని [illegible] శ్రీ [illegible] గారు [illegible] యుమువందలి గీతాశ్లోకములకు యథాతథముగ భావమును సూచించుటకే, సరళమైన గద్యభాషలో ప్రత్యేకముగ ప్రత్యేకముగ, ఈ గ్రంథాన్ని ప్రకటించారట! ఇది చదువరులకూ, విద్యార్థులకూ అనువుగా ఉన్నదని వారి అభిప్రాయం. దీనిపైని విద్వాంసులు కొందరు మంచి అభిప్రాయాలను ఇచ్చారు. మూలభావాన్ని తెలుసుకొనుటకు తాత్పర్యం ఎలా ఉపయోగిస్తున్నదీ గ్రహించుటకొక ఉదాహరణం—

శ్లో. ప్రజహాతియదాకామాన్ సర్వాన్‌పార్థ!మనోగతా
ఆత్మన్యేవాత్మనాతుష్ట: స్థితప్రజ్ఞస్తదోచ్యతే'

అర్జునా! మనుజుడు ఎప్పుడు తనలో తానాత్మానందమును బొందునో, బాహ్య విషయములను మనస్సునందు గోరడో, అట్టి స్థిరావస్థయందుండు వాడే స్థితప్రజ్ఞుడుగా చెప్పబడుచున్నాడు. 'అహం బ్రహ్మాస్మి' యను నిష్ఠ గలవాడే 'స్థితప్రజ్ఞుడు' 'జీవన్ముక్తుడు.'

—అంగీరస

## తొణికిన స్వప్నం తొలగిన స్వర్గం:

[ఎమెస్కో పాకెట్ బుక్]— శ్రీ రేవనూరి శమంతీ రచన. ప్రచురణ: ఎం. శేషాచలం అండ్ కో, మద్రాస్, సికింద్రాబాదు — మచిలీపట్నం. 204 పేజీలు. రూ. 2.

ఒకానొక యువకుడు. అతన్ని ఎందరో యువతులు ప్రేమించారు. అందులో ఇద్దరు గాఢంగా లవ్ చేశారు. ఒకామెను అతడు పెళ్లాడలేదు గాని భార్యగా స్వీకరించాడు. రెండో అమ్మాయిని డబ్బు కోసం చేపట్టబోయాడు.

ఫలితం?—కాంత లిద్దరికీ మధ్య అగ్గి రగలేదుగా? —ఢాం ఢాంమని రెండు పిస్తోళ్లు పేలాయి. యువకుడు ఎగిరిపోయాడు, యువతి మిగిలింది. తొణికింది యవ్వనం, మిగిలింది వైరాగ్యం— ఇది తొణికిన స్వప్నం.

యామినికి పెళ్లికాకముందే ఆరో నెల. ఇందుకు కారకుడు రజనీకాంత్. గర్భవతిని పెళ్లాడగలడా? భార్యగా యామినిని అంగీకరించగలడా?— జంకాడు. తన దారి తను చూసుకుంది యామిని.

సుధాకర్ తల్లిగా—స్టాఫ్ నర్సుగా — ఎయిర్ హోస్టెస్‌గా— సినీతార చంద్రప్రియగా— ఇన్ని అవతారాలు దాల్చిన యామిని క్షయరోగంతో మంచమెక్కింది. సుధాకర్‌ని రజనీకి అప్పగింత పెట్టి కన్ను మూసింది. — తొలిగిన స్వర్గం ఇది.

మొదటి కథ జిగిబిగి కలిగిన కొత్త పంథాలో నడిచింది. ఆ అందచందాలు రెండో దానిలో కొరవడ్డాయి. కథను సాగదీయటమే దీని లోపం. కయిమాక్సు—ముగింపులలో సినీ ధోరణి కనిపిస్తుంది.

ఇంగ్లీషు తెలీనివారు ఈ పుస్తకం చదవటం కష్టం. ఇందులో వాడిన ఆ ఇంగ్లీషు మాటలను తెలుగు చెయ్యటమో లేదా తెలుగు లిపిలో రాయడమో జరిగితే ఉపయోగంగా ఉండేది.

ఆ విద్యార్థులకు మొదటి కథ బాగా మనస్సుకి పట్టుతుంది.

—శివకుమారి

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

దగ్గు, జలుబులు మిమ్మలను బలహీనపరుస్తాయి, ఇతర జబ్బులకు అవకాశము ఇస్తాయి

# వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగి బలంగా, ఆరోగ్యంగా ఉండండి

దగ్గు జలుబులు రోగ నిరోధక శక్తిని తగ్గించి, మిములను బలహీనపఱచి, మీకు ఇతర జబ్బులు వచ్చే అవకాశాన్ని కలుగచేస్తాయి. ఎఱ్ఱ లేబెల్ ఉన్న వాటర్‌బరీస్ కాంపౌండ్ క్రమంగా తీసుకోండి. ఎఱ్ఱ లేబెల్ ఉన్న వాటర్‌బరీస్‌లో గల టానిక్ పదార్థములు పోయిన బలమును తిరిగి ఇచ్చి, ఆకలిని పుట్టించి, రోగ నిరోధక శక్తిని పెంపొందిస్తాయి. దానిలో ఉన్న 'క్రియోసోట్' మరియు 'గయకోల్' దగ్గు, జలుబులనుండి వెంటనే ఉపశమనమును ఇస్తాయి. ఈ కారణాలవల్లనే ఎఱ్ఱ లేబెల్ ఉన్న వాటర్‌బరీస్ బలమును, ఆరోగ్యమును కాపాడుటలో సాటిలేనిది.




**వాటర్‌బరీస్ కాంపౌండ్ అధికంగా నమ్మబడిన టానిక్**

వార్నర్ - లాంబర్ట్ యొక్క నాణ్యమైన తయారీ

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



లక్ష్మీ ఎంటర్ ప్రైజస్



# బాలరాజు కథ

రచన ముళ్ళపూడి వెంకటరమణ కెమెరా సెల్వరాజ్
సంగీతం మహాదేవన్ నిర్మాత నిడుమర్తి పద్మాక్షి
దర్శకుడు బాపు లక్ష్మీ ఫిలింస్